# అవతారిక

కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపత్తనే ।
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ॥

చేరదేశానికి చెందిన (కేరళరాష్ట్రంలోని) **"తిరువఞ్జిక్కళమ్"** అనే దివ్యదేశంలో క్షత్రియకులంలో కలియుగం ప్రారంభమైన 27 సం॥ల తరువాత పరాభవనామ సం॥లో కుంభమాసం - శుద్ధఏకాదశి - గురువారం - పునర్వసు నక్షత్రంలో కౌస్తుభమణి అంశతో కులశేఖరులు అవతరించారు. వీరు గొప్ప పరాక్రమశాలి, పరిపాలనాదక్షులే కాక, పరమభాగవతోత్తములుకూడా. భగవానుని నిర్హేతుక కటాక్షంవల్ల దివ్యజ్ఞానాన్ని పొందిన వీరు లౌకికసంపదను, రాజ్యాధికారాన్ని తృణ ప్రాయంగా తలచి, భగవత్సేవకు అనుకూలం అయిన వేంకటాద్రిపై స్థావరాది జన్మలైనా తమకు పరమోపాదేయం అని భావించారు. శ్రీరంగనాథుని భక్తులైన వీరు ప్రతిదినం శ్రీరంగయాత్రకు పోవాలని ప్రయత్నించేవారనే విషయం **"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే, త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్"** అనే వీరి తమ ముకుందమాలా స్తోత్రంలోని ప్రార్థనాశ్లోకంవల్ల తెలుస్తుంది. శ్రీరామ చంద్రుని విషయంలో, శ్రీరంగనాథుని విషయంలో వీరికి కల వ్యామోహం అధికం. అందువలననే వీరు తమ ప్రబంధ ప్రారంభంలో శ్రీరంగనాథుని, చివరగా రామాయణగాథను కీర్తించారు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో వీరికి **"పెరుమాళ్"** అని వ్యవహారం. కాబట్టి 105 పాశురాలను కల వీరి ప్రబంధంకూడా "పెరుమాళ్ తిరుమొழி" అని వ్యవహరింపబడుతున్నది **"తిరుమొழி"** అంటే సూక్తి.

---

### కులశేఖరప్పెరుమాళ్ ప్రణీతమైన

## పెరుమాళ్ తిరుమొழி - తాత్పర్యంతో

### తనియన్ - 1

### ఎమ్బెరుమానార్ అనుగ్రహించినది

**ఇన్నముత మూట్టుకేన్ ఇఙ్గే వా పైఙ్గిళియే,**
**తెన్నరఙ్గమ్ పాడవల్ల శీర్ ప్పెరుమాళ్ - పొన్నిన్**
**శిలై శేర్ నుతలియర్ వేళ్ శేరలర్ కోన్, ఎఙ్గళ్**
**కులశేకరన్ ఎన్ఱే కూఱు.**

పచ్చని వర్ణాన్ని కల అందమైన చిలుకా! తీయని అమృతాన్ని నీకు తాగిస్తాను; నా దగ్గరకు రా. దక్షిణదిక్కులో ఉండే శ్రీరంగాన్నిగూర్చి తీయని కవిత్వాన్ని (పాశురాలను పాడ) రచించగలవారై, భక్తిమొదలైన గుణాలతో పూర్ణులై, పెరుమాళ్ అనే తిరునామాన్ని కలవారై, ఆశపడదగిన వింటితో సమానం అయిన కనుబొమలను కల స్త్రీలకు మన్మథునివలె మనోహరులై, చేరకులానికి అంతటికీ అధిపతులై, ప్రపన్నులమైన మన కులానికి శిరోభూషణం అయిన కులశేఖరులు అనే తిరునామాన్నే నోరార పల్కు.

**తనియన్-2**

**మణక్కాల్ నంబి అనుగ్రహించినది**

**ఆరజ్గెడ ప్పురనన్బర్ కొళ్ళా రెన్ఱు, అవర్కళుక్కే**
**వారజ్గొడు కుడప్పామ్బిల్ కైయిట్టవన్,- మాఱ్ఱలరై**
**వీరజ్గెడుత్త శెజ్గోల్ కొల్లి కావలన్ విల్లవర్కోన్,**
**శేరన్ కులశేకరన్ ముడివేన్దర్ శికామణియే**

(మంత్రుల పన్నాగం వల్ల) రత్నాల హారం కన్పించకుండాపోగా, ఆహారాన్ని శ్రీవైష్ణవులే దొంగిలించారని మంత్రులు పల్కినపుడు "శ్రీవైష్ణవులు (భగవద్భక్తులు) ఇతరుల ద్రవ్యాలను దొంగిలించరు" అని పల్కి, (దొంగిలించారని చెప్పబడ్డ) శ్రీవైష్ణవుల విషయంలో పక్షపాతాన్ని గ్రహించి, పాము ఉండే కుండలో చేతిని పెట్టి శపథం చేసినవారు, విరోధుల వీర్యాన్ని నిర్వీర్యం చేసిన రాజదండాన్ని కలవారై, కొల్లి అనే నగరానికి నిర్వాహకులై, అన్యప్రభువులకు అధిపతియై, పట్టాభిషిక్తులైన రాజులకు శిరోభూషణమై ఉన్నవారు (ఎవరు! అంటే) చేరకులానికి రత్నంవంటి కులశేఖర ప్పెరుమాళ్.

# మొదటి దశకం

శ్రీకులశేఖరాழ்వార్లు లౌకికవిషయాలలో విరక్తులు. భగవద్భాగవత విషయంలో అత్యంతప్రావణ్యాన్ని కలవారు. వారికి భగవానుని కల్యాణగుణాలలో గల ప్రావణ్యప్రకర్షంచేత పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులు తల ఎత్తి భగవానుని శీఘ్రంగా సేవించాలనే ఆశ మితిమీరింది. పరమపదంలోనికి పోయి అనుభవించాలంటే,

**గమనిక :** ద్రావిడ వర్ణమాలలోని 'ழ' అనే అక్షరాన్ని తెలుగులోని 'ళ' అక్షరంతో సమానంగా, 'ఱ్ఱ' అనే సంయుక్తాక్షరాన్ని 'ట్ర' అనే సంయుక్తాక్షరంతో సమానంగా, 'ఱ' అనే అక్షరాన్ని 'ఱ' అనే అక్షరంతో సమానంగా ఉచ్చరించవచ్చును.



ఈ శరీరం పతనం చెందేవరకు వేచి ఉండాలి. అంత కాలం సహించి ఉండడం ఆழ்వార్లకు సాధ్యం కాలేదు. పరమపదంలో అనుభవించే శీలాది కల్యాణ గుణాలు పూర్ణంగా కల్గినవాడై శ్రీరంగంలో వేంచేసి ఉండే శ్రీరంగనాథుని భగవద్భక్తులతో కలసి దర్శించి, ఆనందించాలని ఈ మొదటి దశకంలో ఆశపడుతున్నారు.

**ఇరుళిరియ చ్చుడర్ మణికళ్ ఇమైక్కుమ్ నెఱ్ఱి**
**ఇనత్తుత్తి అణిపణ మాయిరజ్గళార్న్ద,**
**అరవరశ ప్పెరుమ్ శోతి అనన్ద నెన్నుమ్**
**అణి విళజ్గు ముయర్ వెళ్ళై యణైమై మేవి,**
**తిరువరజ్గ ప్పెరునకరుళ్ తెణ్ణీర్ ప్పొన్ని**
**తిరైక్కైయాల్ అడివరుడ ప్పళ్ళికొళ్ళుమ్,**
**కరుమణియై క్కోమళత్తై క్కణ్డుకొణ్డు ఎన్**
**కణ్ణిణైకళ్ ఎన్ఱుకొలో కళిక్కు నాళే! (1)**

శ్రీరంగం అనే గొప్ప నగరంలో, చీకటి చెదరిపోయేటట్లుగా జ్యోతిస్సును కల మాణిక్యాలు ప్రకాశించే ఫాలభాగాన్ని జంటగా చేరి ఉండే శ్రీపాద చిహ్నాలని చెప్పబడే గుర్తులను కల్గిన పడగలను వేయింటిని పూర్ణంగా కలవారై, సర్పాలకు ప్రభువై, మహాతేజస్వి అయిన తిరువనన్దాழ்వాన్ (ఆదిశేషుడు) అనే, అందంలో అతిశయించిన, ఉన్నతం అయిన తెల్లని శయ్యపై సుఖంగా పొందికగా పరుండి, స్వచ్ఛమైన నీటిని కల కావేరీనది తన కెరటాలనే చేతులలో శ్రీపాదాలను సంవాహనం చేయగా పరుండి ఉండే నీలమణివంటివాడు, నిస్సమాభ్యధికం అయిన సౌకుమార్యాన్ని కలవాడైన శ్రీరంగనాథుని నా నేత్రాల జంట నిరంతరం సేవిస్తూ, ఆనందించడం ఏనాడో కదా! (ఎపుడో కదా!)

**వాయోరీరైఞ్ఞూఱు తుతజ్గళార్న్ద**
**వళైయుడమ్బిల్ అழల్ నాకమ్ ఉమిழ்న్ద శెన్దీ,**
**వీయాత మలర్చ్చెన్ని వితానమే పోల్**
**మేన్మేలుమ్ మిక ఎజ్గుమ్ పరన్దత దన్ కీழ்,**
**కాయామ్ పూమలర్ ప్పిఱజ్గలన్న మాలై**
**క్కడి యరజ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**మాయోనై మణత్తూణే పఱ్ఱి నిన్ఱు ఎన్**
**వాయార వెన్ఱుకొలో వాழ்త్తు నాళే! (2)**

స్తుతులు నిండిన (నిత్యం స్తుతించే) సాటి లేని వేయి నోళ్ళను, తెల్లని తిరుమేనిని కలవాడై, (శత్రువులు దగ్గరకు చేరడానికి వీలులేనట్లుగా) నిప్పును కక్కేవాడైన ఆదిశేషుడు ఎడతెకుండా వెలువరిస్తున్న ఎట్టని అగ్ని ఏనాడూ వాడని పూలను అలంకరించు కొనే భగవానునియొక్క కిరీటానికి మేల్‌కట్టువలె అంతటా అన్ని చోట్ల ఇంకా ఇంకా బాగా వ్యాపించగా, ఆ అగ్నికింద అగిసెచెట్టుయొక్క అందమైన పూలతో కూర్పబడ్డ పూమాలవలె వేంచేసి ఉండేవాడై, సర్వేశ్వరుడై, ప్రాకారాలను కోటలుగా కల శ్రీరంగంలో ఆదిశేషుడనే పడుకలో నిద్రిస్తున్న ఆశ్చర్యకరచేష్టితుని గర్భాలయంలోని ఆమోద స్తంభాలు రెండిటిని ఆశ్రయించి నిలచి, నా నోరార స్తుతించే కాలం ఏనాడోకదా!

**ఎమ్మాణ్బిల్ అయన్ నాన్గు నావినాలుమ్**
**ఎడుత్తేత్తి ఈరిరణ్డు ముకముమ్ కొణ్డు,**
**ఎమ్మాడుమ్ ఎ*ழி*ల్ కణ్‌కళ్ ఎట్టినోడుమ్**
**తొ*ழு*తేత్తి ఇనితిఱైఞ్జ నిన్ఱ, శెమ్బొన్**
**అమ్మాన్ఱన్ మలర్ క్కమల క్కొప్పూ*ழ்* తోన్ఱ**
**అణియరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**అమ్మాన్ఱన్ అడియిణైక్కీ*ழ்* అలర్‌కళిట్టు అఙ్గు**
**అడియవరోడు ఎన్ఱుకొలో అణుకు నాళే!** 3

అన్ని విధాలుగా ఉండే గొప్పతనాన్ని కల బ్రహ్మ (భగవానుని స్తోత్రం చేయడం కోసం ఏర్పడ్డ) తన నాల్గు జిహ్వాలతో తన ఆర్తికి తగినట్లుగా స్తుతించి, నాల్గు వేదాలను అధ్యయనం చేయడంకోసమే ఏర్పడిన నాల్గు ముఖాలతో  అన్ని ప్రక్కలలోను అందమైన ఎనిమిది కన్నులతో అంజలి ఘటించి స్తోత్రాన్ని చేసి, సాష్టాంగంగా సేవించే రీతిలో వేంచేసి ఉండేవాడు, ఎట్టని బంగారంవలె ఆశపడ తగిన స్వామి అయిన వాడు, తనయొక్క, తామరపూవును కల నాభి స్ఫురించేటట్లున్నవాడు, ఈ లోకానికి ఆభరణం అయిన శ్రీరంగంలో ఆదిశేషునిపైన పరుండి ఉండే వాడైన సర్వేశ్వరుని సేవించి, ఆస్వామి శ్రీపాదాలకింద పూలను సమర్పించి, అక్కడి భక్తులతో నేను చేరేనాడు ఏనాడో కదా !

**మావినై వాయ్ పిళన్దుకన్ద మాలై వేలై**
**వణ్ణనై ఎన్ కణ్ణనై వన్‌కున్ఱ మేన్ది,**
**ఆవినై అన్ఱుయక్కొణ్డ ఆయరే*ற్ఱై***
**అమరర్‌కళ్ తన్దలైవనై అన్దమి*ழి*న్బ**



**ప్పావినై, అవ్వడ మొ*ழி*యై ప్ప*ற్ఱా*ర్‌కళ్**
**పయిలరఙ్గ త్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**కోవినై నావుఱ వ*ழு*త్తి ఎన్ఱన్‌కైకళ్**
**కొయ్‌మలర్‌తూయ్ ఎన్ఱుకొలో కూప్పు నాళే!** 4

కేశి అనే అసురుని నోటిని బ్రద్దలు చేసి, (“ఆశ్రితవిరోధులను నిరసించాను కదా!” అని) ఆనందించినవాడై, దాసులపట్ల ప్రేమను కలవాడై, సముద్రంవంటి వర్ణాన్ని కలవాడై,  నాకు సులభుడైన శ్రీకృష్ణుడై, (ఇంద్రుడు శిలావర్షాన్ని కురిపించిన) ఆ సమయంలో బలిమిని కల గోవర్ధనపర్వతాన్ని ఎత్తి, గోవులను రక్షించిన గోపాలురకు నాయకుడై,  నిత్యసూరులకు స్వామియై, అందమైన ద్రావిడభాషతో కూర్పబడ్డ, పరమ భోగ్యాలైన అరుళిచ్చెయల్ (ఆ*ழ்*వార్ల దివ్యప్రబంధాల) వలె తీయనివాడై, అందమైన సంస్కృతభాషలో నిర్మింపబడ్డ శ్రీరామాయణంవలె మధురమైనవాడై ఈ లౌకిక బంధాలను విడిచిన అనన్యప్రయోజనులు నిత్యవాసం చేసే శ్రీరంగంలో ఆదిశేషునిపైన నిద్రించే స్వామి అయిన శ్రీరంగనాథుని నా నాలుక కాయలు కాచేటట్లుగా స్తుతించి, నా చేతులచే కోయబడ్డ పూలను సమర్పించి, అంజలిని ఘటించే కాలం ఏనాడోకదా!

**ఇణై యిల్లా ఇన్నిశై యా*ழ்* కె*ழு*మి యిన్బ**
**త్తుమ్బురువు నారతను మిఱైఞ్జి యేత్త,**
**త్తుణై యిల్లా త్తొన్మఱైనూల్ తోత్తిరత్తాల్**
**తొన్మలర్‌క్కణ్ అయన్ వణఙ్గి యోవాతేత్త,**
**మణిమాడ మాళికైకళ్ మల్‌కు శెల్వ**
**మతిళరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**మణివణ్ణన్ అమ్మానై క్కణ్డుకొణ్డు ఎన్**
**మలర్చ్చెన్ని ఎన్ఱుకొలో వణఙ్గు నాళే!** 5

(తమ గానంతో) ఆనందాన్ని కల్గించే తుంబురుడు, నారదమహర్షి సాటి లేనిది, మధురమైనది అయిన రాగాలను పలికే తమ వీణను మీటి, శ్రీపాదాలలో పడి స్తుతించగా,  సాటి లేని, అనాది అయిన వేదశాస్త్రాలు అనే స్తోత్రాలతో నిత్యమైన తిరునాభీ కమలంలో ఉండే బ్రహ్మ (శ్రీచరణాలలో) నిరంతరం స్తోత్రం చేయగా, రత్నమయాలైన మిద్దెలను, మేడలను, నిండైన ఐశ్వర్యాన్ని కల్గి, కోటలను కల్గిన శ్రీరంగంలో ఆదిశేషునిపై పరుండి ఉండే, అందమైన రూపాన్ని కల సర్వేశ్వరుని ఎడతెగకుండా సేవించి, పూలతో అలంకరించుకొన్న నా శిరస్సు అతని శ్రీచరణాలలో నమస్కరించే కాలం ఎపుడో!

**అళిమలర్మేల్ అయనరనిన్దిరనోడు ఏనై**
**అమర్కళ్ తఙ్గళ్ఴువు మరమ్బైయరుమ్, మఱ్ఱుమ్**
**తెళి మతిశేర్ మునివర్కళ్ తఙ్గళ్ఴువు మున్ది**
**త్తిశైత్తిశైయిల్ మలర్ తూవి చ్చెన్టు శేరుమ్,**
**కళిమలర్ శేర్ పొఴిలరఙ్గత్తురక మేతి**
**క్కణ్వళరుమ్ కడల్వణ్ణర్ కమలక్కణ్ణుమ్,**
**ఒళి మతిశేర్ తిరుముకముమ్ కణ్డుకొణ్డు**
**ఎన్నుళ్ళ మిక ఎన్టుకొలో ఉరుకు నాళే! 6**

తుమ్మెదలు మోగే (ధ్వనించే) తామరపూవుపై ఉన్న బ్రహ్మ, శివుడు, ఇంద్రునితో కూడిన మిగిలిన దేవతల సంఘాలు, రంభ మొదలైన దేవతాస్త్రీలు, ఇంకా ఉండే (నారాయణుడే సర్వేశ్వరుడనే) తేటపడిన జ్ఞానాన్ని కల సనకాదిమహర్షిసంఘాలు, ఒకరికొకరు గుమిగూడి గెంటుకొని కనబడిన చోట అంతా పుష్పాలను సమర్పిస్తూ వచ్చి సమీపించే, తేనె పుష్కలంగా ఉడే పూలతో నిండుగా ఉన్న తోటలను కల రంగంలో, ఆదిశేషునిపై అధిరోహించి కన్నులు మూసికొని తూగే సముద్రంవంటి రూపాన్ని (వర్ణాన్ని) కలవాని ఎఱ్ఱ తామరలవంటి కన్నులను, చల్లని కిరణాలను కల చంద్రునివంటి ముఖమండలాన్ని, సేవించి, నా మనస్సు చాలా మిక్కిలిగా కఱగే కాలం ఎపుడోకదా!

**మఱన్దికఴు మన మొఴిత్తు వఞ్జమాఱ్ఱి**
**ఐమ్బులన్గళడక్కి యిడర్ప్పార త్తున్బమ్**
**తుఱన్దు, ఇఱుముప్పొఴుతేత్తి ఎల్లై యిల్లా**
**త్తొన్నెఱిక్కణ్ నిలై నిన్ఱ తొణ్డరాన,**
**అఱన్దికఴు మనత్తవర్ తఙ్గతియై ప్పొన్ని**
**అణియరఙ్గ త్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**నిఱన్దికఴు మాయోనై క్కణ్డు ఎన్ కణ్గళ్**
**నీర్ మల్క ఎన్టు కొలో నిఱ్కు నాళే! 7**

వధించడం, తీవ్రమైన కోపం, క్రూరత్వం మొదలైన దోషాలతో నిండిన మనస్సును సవాసనగా పోగొట్టుకొని, అసత్యాన్ని (వంచనను) లేకుండా చేసికొని, క్రూరమైన అయిదు ఇంద్రియాలను లౌకికవిషయాలో ఆసక్తం కాని రీతిలో అణచి, చాలా దుఃఖాన్ని కల్గించే ప్రాక్తనకర్మలనే పెనుభారాన్ని తీర్చుకొని, అయిదు కాలాలలో సేవించి, అనాది అయిన ప్రాచీనమైన సంప్రదాయంలో స్థిరంగా నిలచి ఉండే భక్తులైన, కరుణ నిండిన మనస్సును కల శ్రీవైష్ణవులకు మేలైన ప్రాప్యస్వరూపుడై, కావేరీనదిచేత



పరివేష్టితం అయిన అందాన్ని కల శ్రీరంగంలో ఆదిశేషుడనే పర్యంకంపై పరుండి ఉండే, అందంతో కూడిన, ఆశ్చర్యభూతుడైన స్వామిని సేవించి, నా నేత్రాలు ఆనందబాష్పాలు నిండేటట్లుగా నేను నిలచేనాడు ఏనాడో కదా!

**కోలార్న్ద నెడుమ్ శార్ఙ్గమ్ కూనల్ శఙ్గమ్**
**కొలై యాழி కొడున్దణ్డు కొఱ్ఱ వొళ్ వాళ్,**
**కాలార్న్ద కతిక్కరుడ నెన్నుమ్ వెన్టి**
**క్కడుమ్ పఱవై ఇవై యనైత్తుమ్ పుఱమ్శూழ் కాప్ప,**
**శేలార్న్ద నెడుఙ్గఴని శోలై శూழ்న్ద**
**తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**మాలోనై క్కణ్డు ఇన్బ క్కలవి ఎయ్తి**
**వల్వినైయేన్ ఎన్టుకొలో వాఴునాళే! 8**

బాణాలతో సంధింపబడినదై, పెద్దదిగా (దీర్ఘంగా) ఉండే శ్రీశార్ఙ్గమనే విల్లు, భగవదనుభవంచేత గర్వాన్ని పొంది దానివల్ల వంగి విలక్షణం అయిన శ్రీపాంచజన్యం, విరోధులను నిరసించే శ్రీసుదర్శనం, విరోధులకు భయాన్ని కల్గించే శ్రీకౌమోదకి అనే గద, విజయంతో ప్రకాశించే నందకమనే ఖడ్గం, వాయువేగంవంటి గొప్ప వేగాన్ని కల జయశీలుడైన పక్షిరాజు గరుత్మంతుడు – అనే ఇవి అన్నీ చుట్టూ పరివేష్టించి రక్షిస్తూ ఉండగా, మత్స్యాలు నిండిన సస్యక్షేత్రాలతోను, తోటలతోను చుట్టబడి ఉండే శ్రీరంగక్షేత్రంలోని దివ్యాలయంలో ఆదిశేషుడనే పర్యంకంపై పరుండి ఉండే సర్వాధికుడైన భగవానుని మహాపాపి అయిన నేను సేవించి, నిస్సమాభ్యధికం అయిన ఆనందాన్ని అనుభవించి ఉజ్జీవించే దినం ఏనాడో!

**తూరాత మనక్కాతల్ తొణ్డర్తఙ్గళ్**
**కుழாమ్ కుழுమి త్తిరుప్పుకழ்కళ్ పలవుమ్ పాడి,**
**ఆరాత మనక్కళిప్పోడు అழுతకణ్ణీర్**
**మழை శోర నినైన్దురుకి యేత్తి, నాళుమ్**
**శీరార్న్ద ముழైవోశై పరవై కాట్టుమ్**
**తిరువరఙ్గత్తరవణైయిల్ పళ్ళికొళ్ళుమ్,**
**పోరాழிయమ్మానై క్కణ్డు తుళ్ళి**
**ప్పూతలత్తిల్ ఎన్టుకొలో పురళు నాళే! 9**

(భగవదనుభవంలో) ఏ లోటు లేని అభినివేశాన్ని కల మనస్సును కల్గినవారైన శ్రీవైష్ణవుల గోష్ఠిలో కలిసి, (భగవానుని) కల్యాణగుణాలకు వాచకాలైన తిరునామాలను పాడి, (దానివల్ల) తనివి తీరని మనస్సులో కల్గిన సంతోషంచేత ఏడ్చిన కళ్ళలో

ఉండే ఆనందబాష్పాలు వర్షంవలె కురియగా, భగవానుని స్మరించి, అందువల్ల మనస్సు ద్రవించి స్తుతించి, ప్రతిదినం ఐశ్వర్యసూచకం అయిన వాద్యాలఘోష సముద్రఘోషాన్ని తలపించగా, శ్రీరంగక్షేత్రంలోని ఆలయంలో ఆదిశేషునిపై పరుండి ఉండేవాడు, యుద్ధోన్ముఖం అయిన శ్రీసుదర్శనుని శ్రీహస్తంలో ధరించినవాడైన సర్వేశ్వరుని సేవించి, ఆనందంతో తల ఏదో కాలు ఏదో తెలియనట్లు నేను నర్తించి, భూతలంపై పొరలే దినం ఎపుడో కదా !

**వన్ పెరు వానక ముయ్య అమరర్ ఉయ్య**
**మణ్ణుయ్య మణ్ణులకిల్ మనిశర్ ఉయ్య,**
**త్తున్బమికు తుయరకల అయర్వొన్నిల్లా**
**చ్చుకమ్ వళర అకమకిழుమ్ తొణ్డర్ వాழ,**
**అన్బొడు తెన్తిశై నోక్కి ప్పళ్ళికొళ్ళుమ్**
**అణియరఙ్గన్ తిరుముగ్ఱత్తడియార్ తఙ్గళ్,**
**ఇన్బ మికు పెరుఙ్గుழువు కణ్డు యానుమ్**
**ఇశైన్దుడనే ఎన్ఱుకొలో ఇరుక్కు నాళే! 10**

(నైమిత్తిక ప్రళయంలోకూడా) నశించని గొప్పతనాన్ని కల సత్యలోకం మొదలైన లోకాలన్నీ ఉజ్జీవించేటట్లు, (బ్రహ్మాది) దేవతలు తరించేటట్లు, భూమి ఉజ్జీవించేటట్లు, భూమిలో జన్మించిన చేతనులు ఉజ్జీవించేటట్లు, మిక్కిలి దుఃఖాన్ని కల్గించే పాపాలు తీరేటట్లు, దుఃఖం ఏమాత్రం కలవని సుఖం వృద్ధి చెందేటట్లు, మనస్సులో (భగవదను భవంవల్ల కల్గిన) ఆనందాన్ని కల శ్రీవైష్ణవులు ఉజ్జీవించేటట్లు, (శ్రీవిభీషణాழ్వాన్ విషయంలో ఉండే) ప్రేమతో దక్షిణదిక్కును చూచి (చూస్తూ), పరుండి ఉండే, శ్రీరంగానికి అలంకారంవంటివాడైన శ్రీరంగనాథుని దివ్యాలయం లోపల **"తిరుముగ్ఱమ్"** (వాకిలి) అనే చోట ఆనందం నిండిన, శ్రీవైష్ణవుల పెద్ద గోష్ఠిని చూచి, నేనుకూడా వారిలో ఒకడనై వారితో కలసి సేవిస్తూ ఉండడం ఏనాడో కదా!

**తిడల్ విళఙ్గు కరైప్పొన్ని నడువుపాట్టు**
**త్తిరువరఙ్గత్తరవణైయిల్ ప్పళ్ళికొళ్ళుమ్,**
**కడల్ విళఙ్గు కరుమేని యమ్మాన్ఱన్నై**
**కణ్ణార క్కణ్డుకక్కుమ్ కాతల్ తన్నాల్,**
**కుడై విళఙ్గు విఱల్తానై క్కొఱ్ఱ వొళ్వాళ్**
**కూడలర్కోన్ కొడై క్కులశేకరన్ శొఱ్చెయ్త,**



**నడై విళఙ్గు తమిழ்మాలై పత్తుమ్ వల్లార్**
**నలన్దికழ் నారణనడిక్కీழ் నణ్ణువారే 11**

దీవులు ప్రకాశించే తీరాన్ని కల కావేరీనది నడుమన శ్రీరంగంలోని దివ్యాలయంలో ఆదిశేషుడనే పడుకపై పరుండి ఉండే, సముద్రంవలె శ్రమహరం అయిన రూపాన్ని కల సర్వేశ్వరుని కళ్ళార దర్శించి ఆనందించాలనే ఆశతో, తెల్లని ఛత్రాలతో ప్రకాశించేవారై, విజయాన్ని కల సేనను, విజయంతో ప్రకాశించే ఖడ్గాన్ని కలవారై, మధురకు అధిపతియై, కొఱత లేని ఔదార్యాన్ని కలవారైన కులశేఖర ప్పెరుమాళ్ అనుగ్రహించిన (పల్కిన), (చక్కని) శైలితో ప్రకాశించే, (అందమైన) ద్రావిడంలో కూర్చిన ఈ పది పాశురాలను అభ్యసించగల్గినవారు సమస్తకల్యాణ గుణాలు నిండిన శ్రీరంగనాథునియొక్క శ్రీచరణాల దరికి చేరగలరు.

## రెండవ దశకం

ఈ దశకంలో, భగవత్ప్రావణ్యం తదీయశేషత్వపర్యంతమై, వారు లేనిదే తాము నిలువలేని స్థితి తమకు కల్గిందని తెలుపుతున్నారు.

**తేట్టరుమ్ తిఱల్ తేనినై త్తెన్నరఙ్గనై, త్తిరుమాతు వాழ**
**వాట్ట మిల్ వనమాలైమార్పనై వాழ்త్తి మాల్కొళ్ శిన్దైయరాయ్,**
**ఆట్టమేవి యలన్దழైత్తు అయర్వెయ్తుమ్ మెయ్యడియార్కళ్తమ్,**
**ఈట్టమ్ కణ్డిడ క్కూడుమేల్ అతు కాణుమ్ కణ్పయనావతే! 1**

(మానవప్రయత్నంతో) అన్వేషించి పొందదానికి వీలు కానివాడు, **"య ఆత్మదా బలదాః"** అన్నట్లు తనను అనుభవించడానికి ఆవశ్యకం అయిన బలాన్ని ఇచ్చేవాడు, తేనెవలె పరమభోగ్యుడు, అందమైన శ్రీరంగంలో నిత్యవాసం చేసేవాడు, లక్ష్మీదేవి నిత్యవాసం చేసే, ఎల్లప్పుడు వికాసం సువాసన మాఱని అందాన్ని కల వనమాలను అలంకరించుకొన్న వక్షఃస్థలాన్ని కలవాడైన భగవానుని సేవించి, (స్వామికి, స్వామిని కలిగి ఉండే చేరికకు ఏ కొఱత రాకుండా ఉండేటట్లు) మంగళాశాసనాన్ని చేసి, అతనిపై ఉదారమైన భక్తిని కలవారై, (అందువల్ల) నర్తించడంలో అభినివేశాన్ని పొంది, (ఆ నర్తనంయొక్క అతిశయంచేత) అలసి, (నోరున్నదానికి ప్రయోజనం పొందదానికై భగవన్నామాలను) పల్కి, ఒళ్ళు మఱచి ఉండే అనన్యప్రయోజనులైన భక్తుల సంఘాలను దర్శించగల్గితే, కన్నులున్నదానికి ప్రయోజనం అదే కదా!

**తోడులా మలర్మఙ్గైతోళిణై తోయ్న్దతుమ్, శుదర్ వాళియాల్**
**నీడు మామరమ్ శెగ్ఱతుమ్ నిరై మేయ్త్తతుమ్ ఇవైయే నినైన్దు,**
**ఆడి ప్పాడి యరఙ్గ! వో! ఎన్ఱఴైక్కుమ్ తొణ్డరడిప్పొడి**
**ఆడ నామ్పెఱిల్, కఙ్గైనీర్ కుడైన్దాడుమ్ వేట్కై ఎన్నావతే? 2**

దళాలు అధికంగా ఉండే తామరపూవులను నివాసస్థానంగా కల లక్ష్మీదేవియొక్క, బాహువులను రెండిటిని ఆలింగనం చేసికోవడం, కాంతిని (పదును) కల బాణంతో, ఉన్నతాలైన సాలవృక్షాలు ఏడింటిని తొలవడం, గోసమూహాలను మేపడంవంటి చేష్టితాలను అన్నిటినీ తలచి, (దానివల్ల కల్గిన) ఆనందాతిశయంచేత ఆడి పాడి, శ్రీరంగనాథా! అని పిలిచే భక్తులైన శ్రీవైష్ణవుల పాదధూళిలో మనం అవగాహించగల్గితే, గంగానదీ జలంలో అవగాహించి (మునిగి) స్నానం చేయడంలో ఉండే ఆశ ఎందుకు?

**ఏఱడర్త్తదుమ్ ఏనమాయ్ నిలఙ్గీణ్డతుమ్, మున్నిరామనాయ్**
**మాఱడర్త్తతుమ్ మణ్ణళన్దతుమ్ శొల్లి ప్పాడి, వణ్ పొన్నిప్పేర్**
**ఆఱుపోల్ వరుమ్ కణ్ణనీర్ కొణ్డు అరఙ్గన్ కోయిల్ తిరుముఱ్ఱమ్,**
**శేఱు శెయ్ తొణ్డర్ శేవడి చ్చెఴుమ్ శేఱు ఎన్ శెన్నిక్కణివనే 3**

(నప్పిన్నైప్పిరాట్టికోసం) ఏడు ఎద్దులను మర్దించి సంహరించడం, (శ్రీభూమి ప్పిరాట్టికోసం) మహావరాహమై భూమిని దంతంతో గుచ్చి ఎత్తి ఉద్ధరించడం, రావణుడు సీతాదేవిని అపహరించినపుడు, శ్రీరాముడై అవతరించి, విరోధి అయిన రావణుని సంహరించడం, (ఇంద్రునికోసం మహాబలి స్వాధీనం చేసికొన్న సంపాదించడంకోసం) భూమిని త్రివిక్రమరూపియై ఆ భూలోకాన్ని కొలవడం – అనే స్వామి లీలలను నోరార పల్కి ప్రీత్యతిశయంచేత పాడి, పెద్ద ప్రవాహంగా వచ్చే కావేరివలె స్రవించే కన్నీటితో శ్రీరంగనాథుని దివ్యాలయంలోని వాకిలిని బురదగా చేసే శ్రీవైష్ణవుల శ్రీపాదాలచేత తొక్క బడ్డ అందమైన బురదను నా శిరస్సులో అలంకరించుకొంటాను.

**తోయ్త్త తణ్డయిర్ వెణ్ణెయ్ పాలుడనుణ్డలుమ్, ఉడన్ఱాయ్చ్చి కణ్డు**
**ఆర్త్త తోళుడై ఎమ్బిరాన్ ఎన్నరఙ్గనుక్కు అడియార్కళాయ్,**
**నాత్తఴుమ్బెఴ నారణా! ఎన్ఱఴైత్తు మెయ్ తఴుమ్బతు తొఴు**
**ఏత్తి, ఇన్బుఱుమ్ తొణ్డర్ శేవడి ఏత్తి వాఴ్త్తు మెన్నెఞ్జమే. 4**

తోడు పెట్టబడ్డ చల్లని పెరుగును, వెన్నను, పాలను ఒకే సమయంలో ఒక్కసారిగా ఆరగించగానే, యశోదాదేవి చూచి కోపించి, (తరువాత) ఆమెచేత కట్టబడ్డ చేతులను కలవాడైన, నాకు శేషి అయిన శ్రీరంగనాథునకు శేషభూతులై, నాలుక కాయలు కాచేటట్లుగా నారాయణా! అని పిలిచి శరీరంలో కాయలు కాచేటట్లుగా నమస్కరించి, స్తుతించి ఆనందాన్ని పొందే శ్రీవైష్ణవుల శ్రీచరణాలను నా మనస్సు స్తోత్రం చేసి, మంగళాశాసనాన్ని చేస్తుంది.



**పొయ్ శిలై క్కురలేఱ్ఱెరుత్త మిఱుత్తు ప్పోరర వీర్త్త కోన్,**
**శెయ్ శిలై చ్చుడర్ శూఴొళి త్తిణ్ణమామతిళ్ తెన్నరఙ్గనామ్,**
**మెయ్ శిలై క్కరుమేక మొన్ఱు తన్నెఞ్జిల్ నిన్ఱు తికఴ ప్పోయ్,**
**మెయ్ శిలిర్ప్పవర్తమ్మైయే నినైన్దు ఎన్మనమ్ మెయ్ శిలిర్క్కుమే 5**

వంచించే కోపంతో కూడిన రంకెలను వేసే ఏడు కోడెల మూపురాలను మర్దించిన వాడై, యుద్ధం చేయాలని వచ్చిన కాళియుడనే సర్పాన్ని నిరసించిన (రేపల్లెకు) స్వామి, శిలలో నిర్మింపబడి మిక్కిలి కాంతిని పొందికగా కల్గినదై, శ్రీరంగంలో నిత్యవాసం చేసే శ్రీరంగనాథుడనే తన శరీరంలో వింటిని కల ఒక నీలమేఘం తమ మనస్సులో ప్రకాశించగా గగుర్పాటు కల్గిన దేహాన్ని కల శ్రీవైష్ణవులను గూర్చి నా మనస్సు తలచి రోమాంచం పొందుతున్నది.

**ఆతి యన్ద మనన్ద మఱ్పుతమాన వానవర్తమ్పిరాన్,**
**పాత మామలర్ శూడుమ్ పత్తియిలాత పావికళ్ ఉయ్న్దిడ,**
**తీతిల్ నన్నెఱి కాట్టి ఎఙ్గుమ్ తిరిన్దు అరఙ్గనెమ్మానుక్కే,**
**కాతల్ శెయ్ తొణ్డర్క్కు ఎప్పిఱప్పిలుమ్ కాతల్ శెయ్యుమ్ ఎన్నెఞ్జమే 6**

జగత్కారణభూతుడై, ప్రళయకాలంలోకూడా ఒకే స్థితిలో ఉండేవాడై, అన్ని వస్తువులలోను వ్యాపించి ఉండేవాడై, ఆశ్చర్యభూతుడై, నాశం లేని నిత్యసూరులకు స్వామి అయిన శ్రీరంగనాథుని సాటి లేని తామరపూవువంటి శ్రీచరణాలను శిరస్సుపై ధరించేవారై, భక్తి లేని పాపులు సైతం ఉజ్జీవించేటట్లుగా అన్ని చోట్ల సంచరించి, దోషం లేని మంచి మార్గాలను తాము నిర్మించి చూపేవారై, మా స్వామి అయిన శ్రీరంగనాథునిపట్లనే, ప్రేమను కలవారైన భక్తులపట్ల నా మనస్సు అన్ని జన్మలలోను (కైంకర్యాన్ని చేయాలని) ఆశపడతుంది.

**కారి నమ్పురై మేని నఱ్కతిర్ ముత్త వెణ్ణకై చ్చెయ్య వాయ్,**
**ఆరమార్ప నరఙ్గ నెన్ను మరుమ్ పెరుమ్ శుడరొన్ఱినై,**
**శేరు నెఞ్జినరాకి చ్చేర్న్దు కశిన్దిఴిన్ద కణ్ణీర్కళాల్,**
**వార నిఱ్పవర్ తాళిణైక్కు ఓర్ వార మాకుమ్ ఎన్నెఞ్జమే. 7**

మేఘాల సమూహంతో సాటి వచ్చే తిరుమేనిని, అందమైన కాంతిని, ముత్యాల వంటి తెల్లని దంతాలను, ఎఱ్ఱని అధరాన్ని, ముత్యాల మాలను అలంకరించుకొన్న

వక్షఃస్థలాన్ని కలవాడైన శ్రీరంగనాథుడనే, దొరకడానికి అరుదైనది గొప్పతనాన్ని కల్గిన, సాటి లేని తేజోరాశిని పొంది అనుభవించాలనే మనస్సును కలవారై, అతనిని సమీపించి, (భక్తిబలాత్కారంచేత) కఱిగి ప్రవహించే కన్నీరు ప్రవాహమై ప్రవహించే రీతిలో ఉండే భక్తుల రెండు శ్రీచరణాల విషయంలోను, నా మనస్సు (ప్రతిఫలాన్ని ఆశించని) సాటి లేని ప్రేమను కల్గి ఉంటుంది.

**మాలై యు*ఱ్ఱ* కడల్ కిడన్దవన్ వణ్డుకిణ్డు నఱున్దు*ళా*య్,**
**మాలై యు*ఱ్ఱ*వరై ప్పెరుమ్ తిరుమార్చనై మలర్క్కణ్ణనై,**
**మాలై యు*ఱ్ఱెళు*న్దాడి ప్పాడి త్తిరిన్దు అరఙ్గనెమ్మానుక్కే,**
**మాలై యు*ఱ్ఱి*డుమ్ తొణ్డర్ వా*ళ్వు*క్కు మాలైయు*ఱ్ఱ*తు ఎన్నెఞ్జమే** **8**

(తన తిరుమేనిని స్పృశించినందువల్ల గర్వాన్ని పొంది, దానివల్ల) అలలు ఎగిసిపడే సముద్రంలో శయనించి ఉండేవాడు, తుమ్మెదలు గూడుకట్టుకొని ఉండే తులసీ మాలను అలంకరించుకొన్న, పర్వతంవలె విశాలం అయిన వక్షఃస్థలాన్ని కలవాడు, ఎఱ్ఱ తామరలవంటి తిరునేత్రాలను కలవాడైన స్వామి విషయంలో ప్రేమను కల్గి ఉండి, నిలుచున్న చోట నిలువకుండా నాట్యం చేసి పాడి తిరిగి, శ్రీరంగనాథుడనే నా స్వామి విషయంలో పిచ్చెక్కి తిరిగే శ్రీవైష్ణవుల శ్రీవైష్ణవసిరి పట్ల నా మనస్సు ప్రేమను కల్గి ఉన్నది.

**మొయ్త్తు క్కణ్ పని శోర మెయ్కళ్ శిలిర్ప్ప ఏఙ్గి యిళైత్తు నిన్ఱు,**
**ఎయ్త్తు క్కుమ్బిడు నట్టమిట్టు ఎ*ళు*న్దాడి ప్పాడి యిఱైఞ్జి, ఎన్**
**అత్తనచ్చరఙ్గనుక్కు అడియార్కళాకి అవరుక్కే**
**పిత్తరామవర్, పిత్తరల్లర్కళ్ మ*ఱ్ఱై*యార్ ము*ఱ్ఱు*మ్ పిత్తరే.** **9**

కన్నులు వర్షధారలవలె ఆనందాశ్రువులను వర్షించేటట్లు, శరీరం గగుర్పాటు చేందేటట్లు (భగవానుని తలచి) వెక్కి వెక్కి ఏడ్చి, అలసి నిలచి, స్థితి కలతజెంది, ససంభ్రమంగా నృత్యాన్ని చేసి లేచి, ఆటలను ఆడి, పాటలను పాడి, నమస్కరించి, శ్రీరంగనాథునకు భక్తులై, ఆ శ్రీరంగనాథుని విషయంలోనే (భక్తిని పొంది) పిచ్చెక్కి తిరిగేవారు పిచ్చివారు కారు. ఈ విధంగా భక్తి లేని మిగిలినవారంతా పిచ్చి పట్టినవారే.

**అల్లి మామలర్ మఙ్గైనాన్ అరఙ్గన్ మెయ్యడియార్కళ్తమ్,**
**ఎల్లైయిల్ అడిమైత్తిఱత్తినిల్ ఎన్ఱు మేవు మనత్తనామ్,**
**కొల్లి కావలన్ కూడల్ నాయకన్ కో*ళి*క్కోన్ కులశేకరన్,**
**శొల్లినిన్ తమి*ళ్*మాలై వల్లవర్ తొణ్డర్ తొణ్డర్కళావరే**



లోపలి రేకులను కల అందమైన తామరపూవులో అవతరించిన లక్ష్మీదేవికి వల్లభుడైన, శ్రీరంగనాథుని యొక్క నిజమైన దాసుల అంతు లేని కైంకర్య వృత్తిలో ఏకాలంలో అయినా పొందికగా ఉండే మనస్సును కలవారు, కొల్లి నగరానికి అధిపతి, మధురకు ప్రభువు, ఉఱైయూర్‌కు రాజు అయిన కులశేఖరప్పెరుమాళ్ అనుగ్రహించిన తీయని పదాలతో కూడిన ద్రావిడపాశురాలను అభ్యసించగల్గినవారు భగవానుని దాసులకు దాసులు కాగలరు.

## మూడవ దశకం

“దేహాత్మాభిమానం కలవారితో, స్త్రీల సౌందర్యంలో ఆసక్తులై ఉండే లోకంలోని వారితో, మన్మథవశ్యులతో, ఆహారపానీయాలను కోరే లోకులతో, క్షుద్రపురుషార్థాలను అభిలషించేవారితో నేను చేరడం లేదు. అందువల్ల సర్వనిర్వాహకుడై, జగత్కారణ భూతుడై, నిత్యసూరినాథుడైన స్వామి శ్రీరంగానికి వచ్చి సర్వసులభుడై ఉండేవాడు శ్రీరంగనాథుడే – అని సంసారులందఱు నన్ను వీడిపోయేటట్లు ఎలుగెత్తి పల్కుతున్నాను” అని ఈ దశకంలో అంటున్నారు.

**మెయ్యిల్ వా*ళ్*క్కైయై మెయ్యెన క్కొళ్ళుమ్, ఇవ్వైయన్దన్నొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఐయనే! అరఙ్గా! ఎన్ఱు అ*ళై*క్కిన్ఱేన్, మైయల్ కొణ్డొ*ళి*న్దేన్ ఎన్దన్ మాలుక్కే** **1**

అస్థిరం అయిన ఈ లౌకికజీవనాన్ని స్థిరమైనది అని భావించే ఈ లోకంలోని వారితో నేను చేరను. (ఓ నిరుపాధిక) బంధువా! శ్రీరంగనాథా! అని పిలుస్తున్నాను. నాపట్ల ప్రేమను కల భగవానుని విషయంలోనే ప్రేమను (భక్తిని) కలవాడనై ఉన్నాను.

**నూలినేరిడైయార్ తిఱత్తే నిఱ్కుమ్, ఞాలన్దన్నొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఆలియా అ*ళై*యా అరఙ్గా! ఎన్ఱు, మాలె*ళు*న్దొ*ళి*న్దేన్ ఎన్దన్ మాలుక్కే** **2**

నూలుదారంవంటి సన్నని నడుమును కల స్త్రీలపట్ల అభినివేశాన్ని కల్గి ఉండే ఈ లోకంలోనివారితో నేను చేరను, (ప్రేమాధిక్యంచేత) ఆడి, శ్రీరంగా! – అని శ్రీరంగనాథుని నామాన్ని పల్కి పిలిచి, నా విషయంలో వాత్సల్యాన్ని కల స్వామిపట్ల వ్యామోహాన్ని పొంది ఉన్నాను.

**మారనార్ వరివెఞ్జిలైక్కు ఆట్చెయ్యుమ్, పారినారొడుమ్ కూడువతిల్లై యాన్,**
**ఆర మార్బన్ అరఙ్గన్ అనన్దన్, నల్ నారణన్ నరకాన్తకన్ పిత్తనే** **3**

మన్మథుని అందమైన క్రూరమైన వింటికి కట్టుబడి తిరిగే ఈ లోకంలోని జనులతో నేను చేరడం లేదు, ముత్యాలతో కూర్చిన హారాన్ని వక్షఃస్థలంలో కలవాడై, పరిచ్ఛేదించి

ఇంత అని తెలిసికోవడానికి సాధ్యం కానివాడై, జీవాత్మలకు గొప్ప ఆశ్రయమై, దాసులను నరకంలో పడకుండా కాపాడే సర్వేశ్వరుని విషయంలో నేను పిచ్చివాణ్ణి (గొప్ప ప్రేమను కలవాడను)

**ఉణ్డియే ఉడైయే ఉకన్దోడుమ్, ఇమ్మణ్డలత్తొడుమ్ కూడువదిల్లై యాన్,**
**అణ్డవాణన్ అరఙ్గన్ వన్పేయ్ములై, ఉణ్డవాయన్ఱన్ ఉన్మత్తన్ కాణ్మినే 4**

ఆహారాన్ని, వస్త్రాలను మాత్రమే ఆశించి తిరిగే ఈ లోకులతో నేను కలవడం లేదు. ఈ బ్రహ్మాండంలో ఉండేవారికి అధిపతి, క్రూరమైన మనస్సును కల పూతన యొక్క స్తన్యాన్ని దాని ప్రాణాలతో పాటు ఆరగించిన నోటిని కలవాడైన శ్రీరంగనాథుని విషయంలో పైత్యాన్ని (పిచ్చి) పట్టినవాడనై ఉన్నాను.

**తీతిల్ నన్నెఱి నిఱ్క అల్లాతు శెయ్, నీతియారొడుమ్ కూడువదిల్లై యాన్,**
**ఆతి ఆయన్ అరఙ్గన్ అన్దామరై, ప్పేతై మామణవాళన్ఱన్ పిత్తనే 5**

దోషం లేని మంచి మార్గం ఒకటి ఉండగా, దానిని కాదని క్షుద్రపురుషార్థాలను ఆశించడమే వ్రతంగా కలవారితో నేను చేరడం లేదు. అన్ని లోకాలకు కారణమై, శ్రీకృష్ణుడై అవతరించి అందఱికీ సులభుడై, అందమైన తామరపూవును నివాసస్థానంగా కల లక్ష్మీదేవియొక్క నాథుడైన శ్రీరంగనాథుని విషయంలో పిచ్చెక్కి ఉన్నాను.

**ఎమ్బరత్తర్ అల్లారొడుమ్ కూడలన్, ఉమ్బర్వాழ்వై ఒన్రాక క్కరుతిలన్,**
**తమ్బిరాన్ అమరర్క్కు అరఙ్గనకర్, ఎమ్బెరానుక్కు ఎழுమైయుమ్ పిత్తనే 6**

నావలె భగవానునకు దాస్యాన్ని చేయనివారితో నేను కలువను. దేవతల ఐశ్వర్యాలను ఒక పదార్థంగా భావించను. నిత్యసూరులకు నిర్వాహకుడై, శ్రీరంగంలో వేంచేసి ఉండే నా స్వామి అయిన శ్రీరంగనాథుని విషయంలో అన్ని కాలాలలోను నేను పిచ్చివాడనే.

**ఎత్తిఱత్తిలుమ్ యారొడుమ్ కూడుమ్, అచ్చిత్తన్దన్నై త్తవిర్త్తనన్ శెఙ్గణ్మాల్,**
**అత్తనే! అరఙ్గా! ఎన్ఱు అழைక్కిన్ఱేన్, పిత్తనాయ్ ఒழிన్దేన్ ఎమ్బిరానుక్కే 7**

ఏ విషయాన్ని పొందడంకోసం అయినా, ఏవిధం అయిన మానవులలో అయినా, చేరి నశించే నా మనస్సును పుండరీకాక్షుడు పోగొట్టి నన్ను అనుగ్రహించాడు. నన్ను నియమించే స్వామీ! శ్రీరంగనాథా! – అని పిలుస్తున్నాను. (ఇతరవిషయాలలో నాకు ఉండే అభినివేశాన్ని పోగొట్టిన) నా స్వామి విషయంలో నేను పిచ్చివాణ్ణి అయ్యాను.

**పేయరే ఎనక్కు యావరుమ్, యాను మోర్ పేయనే ఎవర్క్కుమ్ ఇతు పేశి యెన్,**
**ఆయనే! అరఙ్గా! ఎన్ఱు అழைక్కిన్ఱేన్, పేయనాయ్ ఒழிన్దేన్ ఎమ్బిరానుక్కే 8**



(స్థిరంగా నిలచి ఉండని భోగాలను కోరే) ఈలోకంలోనివారు అందఱు, (పరమ పురుషార్థాన్ని అభిలషించే) నాకు పిచ్చివారే. నేనుకూడా వారికి అందఱికీ ఒక పిచ్చివాడనే. ఈవిషయాన్ని వివరంగా పల్కి ఏం ప్రయోజనం? గోపాలుడై భూమిలో అవతరించిన ఓ శ్రీకృష్ణా!, శ్రీరంగనాథా! అని పిలుస్తున్నాను. సర్వేశ్వరుని విషయంలోనే నేను పిచ్చి పట్టినవాణ్ణి అయ్యాను.

**అఙ్గై యாழி యరఙ్గ నడియిణై, తఙ్గు శిన్దై త్తనిప్పెరుమ్బిత్తనాయ్,**
**కొఙ్గర్కోన్ కులశేకరన్ శొన్న శొల్, ఇఙ్గు వల్లవర్క్కు ఏత మొన్ఱిల్లైయే 9**

అందమైన శ్రీహస్తంలో శ్రీసుదర్శనాన్ని కల శ్రీరంగనాథుని శ్రీచరణద్వయిలో అభినివేశం పొందే మనస్సును కలవారై, చాలా ప్రేమను వ్యామోహాన్ని కలవారై, పడమటి దిక్కుకు అధిపతి అయిన కులశేఖరాழ்వార్లు పల్కిన ఈ పాశురాలను అభ్యసించగల్గినవారికి ఈ విషయంలో (భగవదనుభవంలో) ఏవిధమైన అడ్డు కలుగదు.

## నాల్గవ దశకం

ప్రకృతి పురుషవివేకాన్ని కల్గిఉండడానికి తగిన యోగ్యతను కల మనుష్య జాతిలోని క్షత్రియజన్మ సయితం వద్దు. కాని, కైంకర్య పరమావధికి తగిన తిర్యక్కుగా పుట్టి, తిరుమలలోని కోనేటిలో నివసించే నీటికొంగగా అయినా, వాగులలోని చేపగా అయినా, గర్భగృహంలో వేంకటేశుడు ఉమిసే బంగారు తమ్మపడిగాన్ని చేతిలో ధరించే భాగ్యాన్ని కల మనుష్యజన్మ అయినా, పరిమళం నిండిన చంపకవృక్షంగా అయినా, పరిమళం లేని స్తంభంగా అయినా, ఆ విధంగాకూడా కాక, తిరుమలలోని ఒక భాగంగా అయినా అడవిలోని వాగుగా అయినా, ఎల్లప్పుడు భక్తుల పాదరేణువు పడే దారిగా ఉండే నిశ్చయాన్ని కలవాడనుగా అయినా, శేషభూతులు, దేవతలు కలసి సంచరించే వేంకటేశుని కోవెల గర్భాలయం వాకిటి గడపగా పడిఉండి, స్వామి అధరాన్ని దర్శించే రీతిలో అయినా, లేక, తిరుమలలోని ఏదైనా ఒక వస్తువుగా అయినా చాలు – అని అంటూ శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో వాలి, తమకు గల కైంకర్యంలోని అభిరుచిని, కైంకర్యవిరోధులపట్ల అరుచిని ఈ దశకంలో ఆழ்వార్లు ఆవిష్కరిస్తున్నారు.

**ఊనేఱు శెల్వత్తు ఉడఱ్పిఱవి యాన్ వేణ్డేన్,**
**ఆనేఱ్ఱு వెన్రాన్ అడిమైత్తిఱ మల్లాల్,**
**కూనేఱు శఙ్గ మిడత్తాన్ఱన్ వేఙ్గడత్తు,**
**కోనేరి వాழுమ్ కురుకాయ్ ప్పిఱప్పేనే 1**

(నప్పిన్నైప్పిరాట్టిని వివాహమాడడంకోసంగా) బలిమిని కల ఏడు ఎద్దులను జయించిన భగవానునకు దాస్యాన్ని చేయడాన్నే తప్ప, (దినదినానికి) మాంసాన్ని (శరీరాన్ని) పెంచే సంపదను కల ఈ మానవజన్మను నేను కోరను. వంపు తిరిగి ఉండే శ్రీపాంచజన్యాన్ని ఎడమచేతిలో కల భగవానునియొక్క వేంకటాద్రిపై గల స్వామి పుష్కరిణిలో నివసించే నీటికొంగగా నేను పుట్టగలనా !

**ఆనాత శెల్వత్తు అరమ్బైయర్‌కళ్ తమ్ శూ*ళ*,**
**వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్,**
**తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడచ్చునైయిల్,**
**మీనాయ్ ప్పిఱక్కుమ్ విదియుడైయే నావేనే 2**

ఏనాటికీ నశించిన (యౌవనం అనే) సంపదను కల రంభ మొదలైన అప్సరసలు తనను పరివేష్ఠించి ఉండగా, స్వర్గాన్ని పాలించే సంపదను, ఈ భూమిని పరిపాలించే ఐశ్వర్యాన్ని నేను కోరను. తేనె నిండుగా ఉండే పూలను కల తోటలను కల్గిన శ్రీవేంకటాచలంలో ఉండే ఒక కొండవాగులో చేపగా అయినా పుట్టే భాగ్యాన్ని కలవాడనుగా నేను కావాలి.

**పిన్నిట్ట శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,**
**తున్నిట్టు ప్పుకలరియ వైకున్ద నీళ్‌వాశల్,**
**మిన్వట్ట చ్చుదరా*ళి* వేఙ్గడక్కోన్ తాన్ ఉమి*ళు*మ్,**
**పొన్వట్టిల్ పిడిత్తుడనే పుకప్పెఱువే నావేనే. 3**

పేనిన జటలను కలవాడైన శివుడు, బ్రహ్మ, దేవేంద్రుడు ఒకరినొకరు సమ్మర్దించుకొని, లోపలకు ప్రవేశించలేకుండా ఉండే (భూలోక) వైకుంఠం అయిన తిరుమలలోని విశాలమైన వాకిటిలో, మెఱపు మెరిసినట్లు కాంతిని వెదజల్లే శ్రీసుదర్శనుని కల శ్రీవేంకటేశ్వరుడు ఉమిసే తమ్మపడిగాన్ని చేతిలో పట్టుకొని, అంతరంగవృత్తిని చేసేవారితో ప్రతిదినం ఆలయం లోపల ప్రవేశించే భాగ్యాన్ని పొందాలి.

**ఒణ్ పవళవేలై ఉలవు తణ్ పొఱ్కడలుళ్,**
**కణ్ణుయిలు మాయోన్ క*ళ*లిణైకళ్ కాణ్బతఱ్కు,**
**పుణ్ పకరుమ్ వణ్డినఙ్గళ్ పణ్బాడుమ్ వేఙ్గడత్తు,**
**చ్చెణ్బకమాయ్ నిఱ్కుమ్ తిరువుడైయే నావేనే 4**



కాంతిని కల పగడాలను తీరాలకు కొట్టుకొని వచ్చి చేర్చే, (అలలు అనే కాళ్ళతో) సంచరించే చల్లని క్షీరాబ్ధిలో నిద్రించే ఆశ్చర్యగుణచేష్టితాలను కల భగవానునియొక్క, రెండు శ్రీచరణాలను సేవించడంకోసం, తీయని రాగాలను పాడే తుమ్మెదల సమూహాలు రాగాలను పాడే తిరుమలలో చంపకవృక్షంగా ఉండే భాగ్యాన్ని కలవాడనై నేను కావాలి.

**కమ్బమతయానై క్క*ళు*త్తకత్తిన్ మేలిరున్దు,**
**ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్,**
**ఎమ్బెరుమాన్ ఈశ నె*ఱ్రి*ల్ వేఙ్గడమలైమేల్,**
**తమ్బకమాయ్ నిఱ్కుమ్ తవముడైయే నావేనే 5**

(చూచినవారు అందఱు) భయపడేటట్లుగా మదాన్ని కల్గిన ఏనుగు కుంభస్థలంపై (తన గొప్పతనం వ్యక్తం అయేటట్లుగా వేంచేసి ఉండి), అన్ని భోగాలను అనుభవించే ఐశ్వర్యాన్ని, (దానికి సాధనం అయిన) ఈ రాజ్యపరిపాలనను నేను ఆశించను. నాకు స్వామి, అన్ని లోకాలకు ప్రభువు అయిన సర్వేశ్వరునియొక్క, అందమైన తిరుమలలో (ఏ పనికి ఉపయోగించని) స్తంభంగా అయినా నిలచి ఉండే భాగ్యాన్ని కల్గినవాడనుగా నేను కావాలి.

**మిన్ననైయ నుణ్ణిడైయార్ ఉరుప్పశియుమ్ మేనకైయుమ్,**
**అన్నవర్‌తమ్ పాడలొడుమ్ ఆడలవై ఆతరియేన్,**
**తెన్న వెన వణ్డినఙ్గళ్ పణ్ పాడుమ్ వేఙ్గడత్తుళ్,**
**అన్ననైయ పొఱ్కువడామ్ అరున్దవత్తనావేనే 6**

మెఱుపువలె సూక్ష్మమైన నడుమును కలవారైన ఊర్వశి, మేనకవంటి అందమైన స్త్రీల ఆటలు, పాటలు మొదలైనవానిని నేను ఆదరించను. తుమ్మెదల గుంపులు **"తెన తెన"** అని ఝుంకారం చేస్తూ రాగయుక్తంగా పాడే వేంకటాద్రిలో, నిస్సమాభ్యధికం అయిన శిఖరం కావడానికి తగిన గొప్ప తపస్సును కలవాడనుగా కావాలి.

**వానాళుమ్ మామతిపోల్ వెణ్ కుడైక్కీ*ళ్* మన్నవర్ తమ్,**
**కోనాకి వీ*ఱ్ఱి*రున్దు కొణ్డాడుమ్ శెల్వతియేన్,**
**తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడమలై మేల్,**
**కానాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయే నావేనే 7**

ఆకాశాన్ని తన వెలుగుతో వ్యాపించే పూర్ణచంద్రునివంటి శ్వేతచ్ఛత్రం నీడలో రాజాధిరాజుగా కొలువుండి, (అందరిచే) కీర్తింపబడే సంపదను సైతం నేను ఒక

వస్తువుగా భావించను. తేనె నిండుగా ఉండే పూల తోటలను కల తిరుమల కొండపై ఒక అడవిలోకి వాగుగా అయినా ప్రవహించేటట్లుగా భావనను కలవాడను కావాలి.

**పిఱై యేఱు శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,**
**ముఱైయాయ పెరు వేళ్వి క్కుఱై ముడిప్పాన్ మఱైయానాన్,**
**వెఱియార్ తణ్‌శోలై త్తిరువేఙ్గడమలైమేల్,**
**నెఱియాయ్ క్కిడక్కుమ్ నిలైయుడైయేన్ ఆవేనే** 8

బాలచంద్రుని జటలలో ధరించిన శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు తమ యోగ్యతకు తగిన రీతిలో చేసే గొప్ప యాగాలకు ఫలంగా వారి వారి కోరికలను పూర్తి చేసేవాడు, వేదప్రతిపాద్యార్థస్వరూపుడై ఉండేవాడు అయిన భగవానుని పరిమళం అతిశయించిన, చల్లని తోటలను కల్గిన శ్రీవేంకటాద్రిపై (శ్రీవైష్ణవుల శ్రీచరణరేణువులు సోకే రీతిలో) దారిగా ఉండే స్థితిని కలవాడనుగా కావాలి.

**శెడియాయ వల్ వినైకళ్ తీర్క్కుమ్ తిరుమాలే!,**
**నెడియానే! వేఙ్గడవా! నిన్ కోయిలిన్ వాశల్,**
**అడియారుమ్ వానవరుమ్ అరమ్బైయరుమ్ కిడన్దియఙ్గుమ్,**
**పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే** 9

పాపఫలం అయిన, క్రూరమైన సంసారసంబంధాన్ని తీర్చే శ్రియఃపతి అయిన స్వామీ! (ఆశ్రితపక్షపాతంలో) ఎల్లను లేనివాడా! వేంకటేశ్వరా! నీ ఆలయముఖ ద్వారంలో (అనన్యప్రయోజనులైన) శ్రీవైష్ణవులు, (ప్రయోజనాంతరపరులైన) దేవతలు, (ఇతరులకు సేవను చేసే) రంభాద్యప్సరసలు కూడి సంచరించే గడపగా పడి ఉండి, నీ పగడంవంటి మోవిని నేను దర్శించాలి.

**ఉమ్బరులకాణ్డు ఒరు కుడైక్కీழ్, ఉరుప్పశితన్**
**అమ్బొఱ్కలైయల్‌కుల్ పెఱ్ఱాలుమ్ ఆతరియేన్,**
**శెమ్బవళవాయాన్ తిరువేఙ్గడ మెన్నుమ్,**
**ఎమ్బెరుమాన్ పొన్మలైమేల్ ఏతేను మావేనే** 10

ఊర్ధ్వలోకాలను అన్నిటిని సాటిలేని శ్వేతచ్ఛత్రం నీడలో పాలించి, ఊర్వశి యొక్క అందమైన బంగారు వస్త్రాన్ని అలంకరించుకొన్న నడుమును నేను పొందినా, దానిని నేను కోరను. ఎఱ్ఱని పగడంవంటి నోటిని కలవాడైన నాస్వామియొక్క వేంకటాద్రి అనే పేరును కల అందమైన పర్వతంపై ఏదయినా ఒక పదార్థంగా నేను కావాలి.



**మన్నియ తణ్ శారల్ వడవేఙ్గడత్తాన్తన్,**
**పొన్నియలుమ్ శేవడికళ్ కాణ్బాన్ పురిన్దిఱైఞ్జి,**
**కొన్నవిలుమ్ కూర్వేల్ కులశేకరన్ శొన్న,**
**పన్నియ నూల్ తమిழ్ వల్లార్ పాఙ్గాయ పత్తర్‌కళే** 11

(విరోధులను) వధించడంలో ప్రావీణ్యాన్ని కల పదునైన వేలాయుధాన్ని కల్గిన కులశేఖరాழ్వార్లు మాఱని, స్థిరంగా ఉండే శైత్యాన్ని కల కొండచరియలను కల్గిన, ఉత్తరదిక్కులోని వేంకటాద్రిపై వేంచేసి ఉండే భగవానునియొక్క బంగారంవంటి గొప్ప ఎఱ్ఱని శ్రీచరణాలను సేవించడానికి ఆశపడి నమస్కరించి, అనుగ్రహించిన విస్తృతమైన లక్షణాలను కలనవి అయిన ద్రావిడశబ్దసందర్భాలను అభ్యసించగలవారు (అతని మనస్సును ఆనందింపజేసే) భోగ్యులైన భక్తులు కాగలరు.

## అయిదవ దశకం

"నాకు నేను రక్షకుడను కాను. ఇతరులు కూడా కారు. ప్రాప్యాన్ని పొందడంలోని త్వరవల్ల నేను తహతహలాడుతున్నాను తప్ప, సాధనానుష్ఠానంలో సమర్థుడను కాను"– అనే విషయాన్ని ఆழ్వార్లు అనన్యగతిని కల వస్తువులను దృష్టాంతాలుగా పల్కుతూ నిత్తువక్కోడు అనే దివ్యదేశంలోని స్వామి ముందు విన్నపిస్తున్నారు. ఈ దశకంలో ఆత్మ – పరమాత్మల మధ్యగల నవవిధ సంబంధాలు సూచింపబడ్డాయని అభిజ్ఞుల సూక్తి.

**తరు తుయరమ్ తడాయేల్ ఉన్‌శరణల్లాల్ శరణిల్లై,**
**విరై కుழువు మలర్ప్పొழిల్ శూழ் విత్తువక్కోట్టమ్మానే!,**
**అరిశినత్తాల్ ఈన్తతాయ్ అకఱ్ఱిడినుమ్, మఱ్ఱవళ్ తన్**
**అరుళ్ నినైన్దే అழుమ్ కుழవి యతువే పోన్ఱిరున్దేనే** 1

పరిమళం మిక్కిలిగా ఉండే పూలను కల తోటలచే చుట్టబడిన తిరువిత్తువ క్కోడు అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామీ!, నీవే ఇచ్చే సంసారమనే ఈ దుఃఖాన్ని నీవే పోగొట్టకపోయినా, నీ శ్రీచరణాలు తప్ప వేఱు ఉపాయం నాకు లేదు. కన్న తల్లి చాల కోపంతో బిడ్డను గెంటివేసినా, తిరిగి ఆమె వాత్సల్యాన్ని భావించి రోదించే చిన్నబిడ్డతో నేను పోలి ఉన్నాను.

**కణ్డారికழ్వనవే కాతలన్తాన్ శెయ్‌తిడినుమ్,**
**కొణ్డానై యల్లాల్ అఱియా క్కులమకళ్‌పోల్,**

**విణ్ణోయ్ మతిళ్ పుదైశూఴ్ విత్తువక్కోట్టమ్మా!, నీ**
**కొణ్డాళా యాకిలుమ్ ఉన్ కురైకఴలే కూఱువనే** 2

ఆకాశాన్ని తాకే కోటలతో చుట్టూ పరివేష్టింపబడ్డ విత్తువక్కోడులోని స్వామీ! చూచేవారందఱూ నిందించదగ్గ కార్యాలనే భర్త చేసినా, తనను వివాహమాడిన ఆ భర్తను తప్ప వేఱెవ్వరినీ మనస్సులో కూడా తలవని కులకాంతవలె, నీవు నావల్ల కైంకర్యాన్ని గ్రహించి రక్షించకుండా ఉపేక్షించినా, నీ ధ్వనించే వీరకడియాలను కల శ్రీచరణాలనే నేను శరణు పొందుతాను.

**మీన్ నోక్కుమ్ నీళ్ వయల్ శూఴ్ విత్తువక్కోట్టమ్మా!, ఎన్**
**పాల్ నోక్కాయాకిలుమ్ ఉన్పఱ్ఱల్లాల్ పఱ్ఱిలేన్,**
**తాన్ నోక్కాతు ఎత్తుయరమ్ శెయ్తిడిలుమ్, తార్వేన్దన్**
**కోల్నోక్కి వాఴుమ్ కుడిపోన్ఱిరున్దేనే** 3

(సముద్రంలో ఉండే) చేపలు (సముద్రం ఎండిపోయినా మనకు ఆశ్రయం ఇదే సుమా! అని) చూచే రీతిలోని విస్తరించిన సస్యక్షేత్రాలచేత చుట్టబడి ఉండే విత్తువక్కోడు దివ్యదేశంలోకి స్వామీ! దాసుని నీవు కటాక్షించకపోయినా, నిన్ను శరణంగా ఆశ్రయించడాన్ని విడచి ఇంక ఎవరినీ శరణు పొందను. (ప్రజల రక్షణకోసం) మాలను ధరించిన ప్రభువు, (అటువంటి) తానే ప్రజలను కాపాడకుండా ఎటువంటి దుఃఖాలను కల్గించినా, అతని శాసనదండాన్నే చూచి ఉజ్జీవించే జనులతో నేను పోలి ఉన్నాను.

**వాళాల్ అఱుత్తు చ్చుడినుమ్ మరుత్తువన్పాల్,**
**మాళాత కాతల్ నోయాళన్ పోల్, మాయత్తాల్**
**మీళా త్తుయర్ తరిలుమ్ విత్తువక్కోట్టమ్మా!, నీ**
**ఆళా ఉనతరుళే పార్ప్పన్ అడియేనే.** 4

విత్తువక్కోడు దివ్యదేశంలో ఉండే స్వామీ! వైద్యుడు కత్తిలో నఱకడం, వాతపెట్టడం వంటివి చేసినా, ఆ వైద్యునిపట్ల తొలగని ప్రేమను కల రోగివలె, నీవు నీ మాయతో నాకు తీరని దుఃఖాన్ని కల్గించినా, నీకు దాసుణ్ణి అయిన నేను నీకు కైంకర్యం చేయడంకోసంగా నీ నిర్హేతుక కృపనే ఎదురుచూస్తాను.

**వెఙ్గట్టిణ్ కళిఱడర్త్తాయ్ విత్తువక్కోట్టమ్మానే!,**
**ఎఙ్గు ప్పోయ్ ఉయ్కేన్ ఉన్నిణైయడియే యడైయలల్లాల్,**
**ఎఙ్గుమ్ పోయ్ క్కరై కాణాతు ఎతికడల్ వాయ్ మీణ్డేయుమ్,**
**వఙ్గత్తిన్ కూమ్బేఱుమ్ మాప్పఱవై పోన్ఱేనే.** 5

భయంకరాలైన నేత్రాలను, కఠినహృదయాన్ని కల (కువలయాపీడం అనే) ఏనుగును సంహరించినవాడా! విత్తువక్కోడు అనే దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామీ! నీ శ్రీచరణాలను శరణు పొందడం తప్ప వేఱెక్కడకు పోయి ఉజ్జీవించగలను? అలలు వీచే సముద్రం నడుమ నాల్గు దిక్కులలోకి పోయి, తీరాన్ని చూడలేక తిరిగివచ్చి, అక్కడ ఉండే నావయొక్క చుక్కాని కర్రపైకి ఎక్కి, దారికోసం వెదకే పెద్ద పక్షివలె ఉన్నాను.

**శెన్దఴలే వన్దఴలై చ్చెయ్తిడిలుమ్, శెఙ్గమలమ్**
**అన్దరమ్ శేర్ వెఙ్గతిరోఱ్కల్లాల్ అలరావాల్,**
**వెన్దుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా!, ఉన్**
**అన్దమిల్ శీరక్కల్లాల్ అకమ్ కుఴైయమాట్టేనే** 6

ఎఱ్ఱని నిప్పు సమీపానికి వచ్చి వెచ్చదనాన్ని కల్గించినా, ఎఱ్ఱ తామరపూవు ఆకాశంలో ప్రకాశించే వేడి కిరణాలను కల సూర్యుని చూచి తప్ప (ఆ నిప్పును చూచి) వికసించదు. విత్తువక్కోడు అనే దివ్యదేశంలో ఉండే స్వామీ! (అనుభవైక వినాశ్యాలైన) నా క్రూరకర్మలను నీవు పోగొట్టకపోయినా, నీ అవధి లేని కల్యాణ గుణాలకు తప్ప (ఇంకొకదానికి) నా మనస్సు ద్రవించదు.

**ఎత్తనైయుమ్ వాన్ మఱన్ద కాలత్తుమ్ పైఙ్గూఴ్కళ్,**
**మైత్తెఴున్ద మాముకిలే పార్త్తిరుక్కుమ్ మఱ్ఱవైపోల్,**
**మెయ్త్తుయర్ వీట్టావిడిలుమ్ విత్తువక్కోట్టమ్మా!, ఎన్**
**శిత్తమ్ మిక ఉన్పాలే వైప్పన్ అడియేనే** 7

విత్తువక్కోడులోని స్వామీ! మేఘాలు ఎంతకాలం వర్షం కురవకపోయినా, పచ్చదనాన్ని కల పైరులు నల్లని రంగుతో ఆకాశం పైకి వచ్చే పెద్ద పెద్ద మేఘాలనే వానకోసం ఎదురుచూస్తూ ఉంటాయి. ఆ సస్యాలవలె, తప్పక అనుభవించి తీరవలసిన దుఃఖాలను నీవు పోగొట్టకపోయినా, దాసుణ్ణి అయిన నేను నా మనస్సును నీ విషయంలోనే మిక్కిలిగా కల్గి ఉంటాను.

**తొక్కిలఙ్గు యాఱెల్లామ్ పరన్దోడి, తొడుకడలే**
**పుక్కన్ఱి ప్పుఱమ్ నిఱ్క మాట్టాత మఱ్ఱవైపోల్,**
**మిక్కిలఙ్గు ముకిల్ నిఱత్తాయ్ విత్తువక్కోట్టమ్మా!, ఉన్**
**పుక్కిలఙ్గు శీరల్లాల్ పుక్కిలన్ కాణ్ పుణ్ణియనే!** 8

పుష్కలమైన జలప్రవాహంతో ప్రకాశించే నదులన్నీ (కన్పించని చోట్ల అంతటా) వ్యాపించి ప్రవహించి, గంభీరమైన సముద్రంలోకి చేరి కలుస్తాయి తప్ప, వేఱొక చోటికి పోయి చేరవు. మిక్కిలిగా ప్రకాశించే కాలమేఘంవంటి వర్ణాన్ని కలవాడా! విత్తువక్కోడులోని స్వామీ! పుణ్యస్వరూపా! ఆ నదులవలె, నా మనస్సులో ప్రవేశించి ప్రకాశించే నీ కల్యాణగుణాలలో తప్ప, (వేఱు దేనిలోను) నేను అవగాహించను.

**నిన్నైయే తాన్ వేణ్డి నీళ్ శెల్వమ్ వేణ్డాతాన్**
**తన్నైయే, తాన్ వేణ్డుమ్ శెల్వమ్పోల్, మాయత్తాల్**
**మిన్నైయే శేర్ తికిరి విత్తువక్కోట్టమ్మా!,**
**నిన్నైయేతాన్ వేణ్డి నిఱ్పన్ అడియేనే** **9**

మెఱుపువంటి ప్రకాశం నిండి ఉండే చక్రాన్ని కల విత్తువక్కోడులోని స్వామీ! నిన్నే కోరి నాశరహితం అయిన ఐశ్వర్యాన్ని కోరనివానిని స్వయంగా వచ్చి చేరగోరే నశ్వరమైన ఐశ్వర్యంవలె, నీ మాయతో (నన్ను ఉపేక్షించినా), దాసుణ్ణి అయిన నేను నిన్నే పొందాలని కోరుతున్నాను.

**విత్తువక్కోట్టమ్మా! నీ వేణ్డాయే యాయిడినుమ్,**
**మ*ఱ్ఱా*రుమ్ ప*ఱ్ఱి*లేనెన్ఱు అవనైత్తాళ్ నయన్ద,**
**కొ*ఱ్ఱ*వేల్ తానై క్కులశేకరన్ శొన్న**
**న*ఱ్ఱ*మి*ళ్* పత్తుమ్ వల్లార్ నణ్ణార్ నరకమే** **10**

విత్తువక్కోడులో వేంచేసి ఉండే సర్వేశ్వరా! నీవు నన్ను అభిలషించకపోయినా, ఇక ఎవరిని నేను శరణు పొందను అని – ఆ సర్వేశ్వరుని శ్రీచరణాలలో అభినివేశంతో విజయాన్నే ఇచ్చే వేలాయుధాన్ని, సేనను కలవారైన, కులశేఖరా*ళ్వా*ర్లు అనుగ్రహించిన, అర్థగౌరవాన్ని కల ద్రావిడపాశురాలను పదింటిని అభ్యసించగల్గినవారు (క్రూరపాపాలను చేసినా) ఈ సంసారంలోకి వచ్చి తిరిగి జన్మించరు.

## ఆఱవ దశకం

ఆ*ళ్వా*ర్లకు అవతారాల అనుభవంలో అపేక్ష కల్గగా, అవతారాలలో అత్యంతం సన్నిహితమైనది శ్రీకృష్ణావతారం కనుక, "అయ్యో! ఒక మంగళవారం ముందుగా జన్మించలేకపోయానే. ఆ అవతారానుభవాన్ని కోల్పోయానే!" అని తలచి పదిలక్షల మంది గోపాలుర గృహాలలో గోపికలకు శ్రీకృష్ణుని పట్ల గల ఆర్తి అంతా తమకు ఒక్కరినే కల్గినందువల్ల, రేపల్లెలో గోపికల మాటలరూపంలో ఈ దశకంలో పల్కుతున్నారు.



**ఏర్ మలర్ ప్పూజ్కు*ళ*ల్ ఆయర్ మాతర్ ఎనై ప్పలరుళ్ళ ఇవ్వూరిల్, ఉన్తన్**
**మార్వు త*ళు*వుతఱ్కు ఆశై యిన్మై అతిన్దతిన్దే ఉన్తన్ పొయ్యై క్కేట్టు,**
**క్కూర్ మ*ళై*పోల్ పనిక్కూతలెయ్తి క్కూశి నడుజ్గి యమునైయా*ఱ్ఱి*ల్,**
**వార్ మణఱ్కున్ఱిల్ పులరనిన్తేన్ వాశుతేవా! ఉన్ వరవు పార్త్తే** **1**

ఓ వసుదేవకుమారా! అందమైన మాలను అలంకరించుకొన్న, సువాసనతో కూడినవైన కేశాలను కల గోపికలు ఎందరో ఉండే ఈ రేపల్లెలో నీ వక్షస్సును ఆలింగనం చేసికోవడంలో నాకు ఆశలేక పోవడాన్ని చక్కగా తెలిసికొన్నా, నీ అసత్యం అయిన మాటలను విని, పెద్ద వర్షంవలె కురుస్తున్న మంచువల్ల ఏర్పడిన చల్లదనంలో చిక్కుకొని, (ఎవరు చూస్తారో? ఏమో! అని) జంకి, (భయంవల్ల, చలివల్ల) వణకి గడగడలాడి, యమునానదిలోని పెద్ద ఇసుకతిన్నెలో నీ రాకను ఎదురు చూచి, పొద్దు పొడిచేవరకు నిలచి ఉన్నాను.

**కెణ్డై యొణ్కణ్ మడవాళొరుత్తి కీ*ళై* యకత్తు త్తయిర్ కడైయ**
**క్కణ్డు, ఒల్లై నానుమ్ కడైవనెన్ఱు కళ్ళవి*ళి*యై వి*ళి*త్తుప్పుక్కు,**
**వణ్డమర్ పూజ్కు*ళ*ల్ తా*ళ్*న్దులావ వాణ్ ముకమ్ వేర్ప్ప చ్చెవ్వాయ్ తుడిప్ప,**
**త్తణ్డయిర్ నీ కడైన్దిట్ట వణ్ణమ్ తామోతరా! మెయ్యఱివన్ నానే** **2**

దామోదరా! నా ఇంటికి తూర్పుదెసలో ఉండే ఇంటిలో బేడిసచేపలవంటి కాంతి నిండిన కన్నులను కల్గినదైన ఒక అందమైన వనిత ఒంటరిగా పెరుగును చిలుకడాన్ని నీవు చూచి, "నేనుకూడా (నీతోపాటు) శీఘ్రంగా పెరుగును చిలికి ఇస్తాను" – అని పల్కి, ఆమెవైపు దొంగ చూపులను చూచి, ఆమె దగ్గరకు చేరి ప్రవేశించి, తుమ్మెదలు అమరి ఉండే పూలు అలంకరించుకొన్న నీ కేశపాశం చాలా కిందకు వేలాడుతూ, అటు ఇటు కదలాడేటట్లుగా, కాంతి నిండిన నీ ముఖంలో స్వేదం అంకురించేట్లుగా, ఎఱ్ఱని నీ పెదవులు అదిరేటట్లుగా చల్లని పెరుగును నీవు చిలికిన తీరులోని మర్మాన్ని నేను తెలియగలనులే.

**కరు మలర్ క్కూన్ద లొరుత్తితన్నై క్కడైక్కణిత్తు, ఆజ్గే యొరుత్తితన్పాల్**
**మరువి మనమ్ వైత్తు మ*ఱ్ఱొ*రుత్తి క్కురైత్తు ఒరుపేతైక్కు ప్పొయ్ కుఱిత్తు,**
**ప్పురికు*ళ*ల్ మజ్గై యొరుత్తితన్నై ప్పుణర్తి అవళుక్కుమ్ మెయ్యనల్లై,**
**మరుతిఱుత్తాయ్! ఉన్ వళర్త్తియూడే వళర్కిన్తతాల్ ఉన్తన్ మాయైతానే** **3**

పూలతో కూడిన, నల్లని కేశబంధాన్ని కల్గిన ఒక గోపికను క్రీగంటిచూపులతో చూచిన నీవు ఆ సమయంలోనే వేఱొక స్త్రీ వైపు మనస్సును పొందికగా నిలిపి,

అపుడే వేఱొక స్త్రీతో "నీ దాసుణ్ణి నేను" అని పల్కి, ఏమీ తెలియని ఒక కన్యకకు (ఇక్కడ నాకోసం కాచుకొని ఉండు) అని అసత్యమైన చోటును నిర్దేశించి, అందమైన కేశపాశాన్ని కల ఒక చిన్ని కన్నియతో నీవు కలిశావు. ఆ కన్యకు కూడా అసత్యాన్నే పలికావు. (చిన్నవయస్సులోనే) రెండు మద్దిచెట్లను విఱిచి కూలగొట్టినవాడా! నీ వయస్సు పెరుగుతున్నకొద్దీ నీ దొంగతనం, అయ్యో! వృద్ధిచెందుతున్నదే !

**తాయ్ ములైప్పాలిల్ అముతిరుక్క త్తవ*ళ్*న్దు తళర్నడై యిట్టు చ్చెన్ఱు,**
**పేయ్ ములై వాయ్ వైత్తు నఞ్జై యుణ్డు పిత్తనెన్ఱే పిఱరేశనిన్ఱాయ్,**
**ఆయ్ మికు కాతలొడు యానిరుప్ప యాన్ విడ వన్ద ఎన్తూతియోడే,**
**నీ మికు పోకత్తై నన్గుకన్దాయ్ అతువుమ్ ఉన్ కోరమ్బుక్కు ఏఱ్కుమన్ఱే 4**

తల్లి అయిన యశోదాదేవియొక్క స్తన్యంలో పరమభోగ్యం అయిన పాలు ఉన్నా, (దానిని ఆరగించకుండా), దోగాడుతూ తడబడే గమనంతో వెళ్ళి, పిశాచి అయిన పూతనస్తన్యంలో నోటిని పెట్టుకొని విషాన్ని ఆరగించి, పిచ్చివాడు అని ఇతరులు నిందించే రీతిలో ఉన్నవాడా! నేను నీ పట్ల చాలా అధికం అయిన ప్రేమతో ఉండగా, నీవు, నాచే దూతగా పంపబడి వచ్చిన నా పరిచారికతో చాలా భోగాన్ని చక్కగా అనుభవించావు. ఆ లీలకూడా నీ తుంటరితనానికి తగినట్లే ఉన్నది కదా!

**మిన్నొత్త నుణ్ణిడైయాళై క్కొణ్డు వీజ్గిరుళ్వాయ్ ఎన్దన్ వీతియూడే,**
**పొన్నొత్త వాడై కుక్కూడలిట్టు ప్పోకిన్దపోతు నాన్ కణ్డు నిన్ఱేన్,**
**కణ్డు*ఱ్ఱ*వళై నీ కణ్ణాలిట్టు క్కై విళిక్కిన్దతుమ్ కణ్డే నిన్ఱేన్,**
**ఎన్నుక్కు అవళై విట్టుఙ్గువన్దాయ్! ఇన్న మజ్గే నడ నమ్బి! నీయే 5**

మెఱుపువంటి సన్నని నడుమును కల ఒక కన్యకను ఆలింగనం చేసికొని, దట్టమైన చీకటిలో బంగారురంగులోని వస్త్రంతో ముసుగు వేసికొని, మా వీథి మార్గాన (ఆమె, నీవు కలసి) పోయేటపుడు నేను చూస్తూనే ఉన్నాను. (ఇంకా) కంటికి కనబడిన ఇంకొక కన్యకను (నీకే ఆమె వశం అయేటట్లుగా) కన్ను గీటి (ఇక్కడికి రా – అని) చేతితో చూపించడాన్ని చూస్తూనే ఉన్నాను. (ఏమీ తెలియని) ఆ కన్యను విడచి ఇక్కడికి ఎందుకోసం వచ్చావు? కల్యాణగుణపూర్ణా!, ఇకపై కూడా నీవు ఆమె దగ్గరకే పో.

**మఱ్పొరు తోళుడై వాశుతేవా! వల్వినైయేన్ తుయిల్ కొణ్డవాఱే,**
**ఇ*ఱ్ఱై*యి యిరవిడై యేమ త్తెన్నై ఇన్నణై మేలిట్టకన్ఱు నీ పోయ్,**



**అ*ఱ్ఱై* యిరవుమ్ ఓర్ పి*ఱ్ఱై*నాళుమ్ అరివైయరోడుమ్ అణైన్దు వన్దాయ్,**
**ఎ*ఱ్ఱై*క్కు నీ ఎన్మరుజ్గిల్ వన్దాయ్! ఎమ్బెరుమాన్! నీ ఎ*ళు*న్దరుళే 6**

మల్లులతో పోరాడిన బాహువులను కల వసుదేవకుమారా! మహాపాపాన్ని చేసిన నేను నిద్రపోవడం ఆరంభించగానే, ఆ రాత్రి నడుజాములో కలయకకు తగినదిగా ఉండే ఒక శయ్యపై నన్ను పరుండబెట్టి నీవు నన్ను విశ్లేషించి పోయి, ఆరాత్రి దానికి మఱునాడు (అయిదు లక్షల ఇళ్ళలోని అందఱు) కన్యకలతో సంశ్లేషించి వచ్చావు. అటువంటి నీవు, నా దగ్గరకు ఎందుకోసం వచ్చావు? నా స్వామీ! ఇక నీవు ఆవలికి పో.

**పైయరవినణై ప్పళ్ళియినాయ్! పణ్డెయోమ్ అల్లోమ్ నామ్, నీ యుకక్కుమ్**
**మైయరి యొణ్ కణ్ణినారు మల్లోమ్ వైకి ఎన్ శేరి వరవొ*ళి* నీ,**
**శెయ్య వుడైయుమ్ తిరుముకముమ్ శెజ్గని వాయుమ్ కు*ళ*లుమ్ కణ్డు,**
**పొయ్యోరునాళ్ పట్టతే యమైయుమ్ పుళ్ళువమ్ పేశాతే పోకు నమ్బీ! 7**

పడగలను కల ఆదిశేషుడనే పడుకలో పరుండి ఉండేవాడా! గుణపూర్ణా! మేము (నీ కపటబూటకపు మాటలకు లోబడడానికి) పాత గోపికలం కాము. నీవు అభిలషించదగినవారై, కాటుక పెట్టుకొని, నల్లని తుమ్మెదవలె ప్రకాశాన్ని నిండుగా కల కన్నులను కల కన్యలము కాము. ఆకాలంలో మేముండే చోటికి రావడం మానివేస్తావుగాక! నీ అందమైన పీతాంబరాన్ని, తిరుముఖమండలాన్ని, ఎఱ్ఱని దొండపండువంటి పెదవులను, అందమైన కేశబంధాన్ని చూచి, నీ అబద్ధపు మాటలను నిజమని నమ్మి, ఒకనాడు మేము పడిన పాట్లు ఒక్కటే చాలు కదా! వంచన చేసే మాటలను తిరిగి చెప్పకుండా ఈ చోటును విడిచి వెళ్ళిపో!

**ఎన్నై వరుక ఎన కుఱిత్తిట్టు ఇనమలర్ ముల్లైయిన్ పన్దల్ నీ*ళ*ల్,**
**మన్నియవళై ప్పుణర ప్పుక్కు మ*ఱ్ఱై*న్నై క్కణ్డు ఉ*ళ*ఱా నెకి*ళ్*న్దాయ్,**
**పొన్నిఱ వాడైయై క్కైయిల్ తాజ్గి ప్పొయ్యచ్చుఱాట్టి నీ పోతియేలుమ్,**
**ఇన్నమ్ ఎన్ కైయకత్తు ఈఙ్గొరునాళ్ వరుతియేల్ ఎన్ శినమ్ తీర్వన్నానే 8**

నన్ను (ఇక్కడకు) రా – అని చోటును నిర్దేశించి, సమృద్ధిగా పూవులను కల మల్లిపందిరి నీడలో మన్నికగా కాచుకొని ఉండే గోపికను సంశ్లేషించడానికి ఆరంభించగానే, మళ్ళీ నన్ను చూచి, కలత చెంది ప్రక్కకు జరిగి ఆమె వైపుకు వెళ్ళావు. పీతాంబరాన్ని, చేతిలో ధరించి, నాకు భయపడినట్లుగా అసత్యభయాన్ని

నటించి, నీవు (నాచేతికి అందకుండా) తప్పిపోయినా, ఇకపై ఇక్కడకు, నేనున్నచోటికి ఒకనాడయినా రాకుండా పోవు కదా! అపుడు నేను నా కోపాన్ని తీర్చుకొంటాను.

**మఙ్గల నల్ వనమాలై మార్విలిలఙ్గ మయిల్ తఴైప్పీలి శూడి,**
**ప్పొఙ్గిళవాడై అరైయిల్ శాత్తి ప్పూఙ్గొత్తు క్కాతిల్ పుణర ప్పెయ్‌తు,**
**కొఙ్గు నఱుఙ్గుఴలార్‌కళోడు కుఴైన్దు కుఴలిని తూతి వన్దాయ్,**
**ఎఙ్గళుక్కే ఒరునాళ్ వన్దూత ఉన్‌కుఴలిన్నిశై పోతరాతే 9**

మంగళకరమై, అందమైన వనమాల వక్షఃస్థలంలో ప్రకాశించగా, విరిసిన నెమలి పింఛాన్ని (కిరీటంలో) అలంకరించుకొని, చాలా మృదువైన వస్త్రాన్ని నడుములో కట్టుకొని, పూలగుత్తులను చెవిలో బాగా పొందికగా అలంకరించుకొని, తేనెతో, సువాసనతో కూడిన కేశపాశాన్ని కల కన్యలతో కలిసి, (అందువల్ల కల్గిన సంతోషం యొక్క వ్యక్తీకరణరూపంగా) పిల్లనగ్రోవిని చాలా అందంగా ఊదుతూ వచ్చావు. ఒకనాడైనా మాకోసంగా వచ్చి ఊదేటట్లు నీ పిల్లినగ్రోవి రాగం వెలువడదా!

**అల్లిమలర్ తిరుమఙ్గైకేళ్వన్దన్నై నయన్దు ఇళవాయ్‌చ్చిమార్‌కళ్,**
**ఎల్లిప్పొఴుతినిల్ ఏమత్తూడి ఎళ్‌కి యురైత్త ఉరైయతనై,**
**కొల్లినకర్‌క్కిఱై కూడల్కోమాన్ కులశేకరన్ ఇన్నిశైయిన్మేవి,**
**శొల్లియ ఇన్ తమిఴ్‌మాలై పత్తుమ్ శొల్లవల్లార్‌క్కు ఇల్లై తున్బమ్ తానే 10**

లేతవయస్సులోని గోపికలు తామరపూవులో పుట్టిన లక్ష్మీదేవికి వల్లభుడైన శ్రీకృష్ణుని అభిలషించి, రాత్రి నడుజాములో అతనితో ప్రణయకలహం ఆడి, అందువల్ల అభినివేశాన్ని పొంది పల్కిన పాశురాలను, కొల్లినగరానికి ప్రభువు, మధురకు అధిపతి అయిన కులశేఖరాఴ్వార్లు తీయని రాగంలో అన్వయించేటట్లుగా పల్కిన మధుర ద్రావిడ పాశురాలను అభ్యసించగలవారికి (భగవదనుభవానికి అడ్డు అయిన) దుఃఖం ఏదీ ఉండదు.

## ఏడవ దశకం

ఈ భగవానునితో తమకు సహజసంబంధం ఉండగా, ఆ జ్ఞానాన్ని అనాదిగా కోల్పోయానే! – అనే బాధ తల ఎత్తింది ఆఴ్వార్లకు. పూర్వం శ్రీకృష్ణుని కుమారునిగా పొంది, బాలకృష్ణుని బాల్యచేష్టితాలను అనుభవించలేక కోల్పోయిన దేవకీదేవి, కంస వధపర్యంతమైన విరోధి నిరసనాన్ని చేసి, తమకు దర్శనాన్ని అనుగ్రహించిన శ్రీకృష్ణుని చూచినపుడు అంతవరకు పొందలేక కోల్పోయిన అనుభవాలను ప్రస్తావిస్తూ



ఆక్రందించే దేవకీదేవి పాశురాలరూపంలో ఆఴ్వార్లు అనాదికాలంగా తాము భగవదనుభవాన్ని కోల్పోవడాన్నిగూర్చి ఈ దశకంలో పల్కుతున్నాయి.

**ఆలైనీళ్ కరుమ్బన్నవన్ తాలో! అమ్బుయ త్తడఙ్గణ్ణినన్ తాలో!,**
**వేలైనీర్ నిఱత్తన్నవన్ తాలో! వేఴప్పోతక మన్నవన్ తాలో!,**
**ఏలవార్‌కుఴలెన్మకన్ తాలో! ఎన్ఱెన్ఱు ఉన్నై ఎన్ వాయిడై నిఱైయ,**
**త్తాలొలిత్తిడుమ్ తిరువినై ఇల్లా త్తాయరిల్ కడైయాయిన తాయే 1**

(చెఱకురసం తీసే) యంత్రంలో పెట్టి రసం పిండడానికి తగినట్లు పొడవుగా ఉండే చెఱకువంటివాడా! నీకు జోల. తామరపూవువంటి విశాలమైన తిరునేత్రాలను కలవాడా! నీకు జోల. సముద్రజలంయొక్క వర్ణంవంటి వర్ణాన్ని కలవాడా! నీకు జోల. గున్నఏనుగు లీలలవంటి లీలలను కలవాడా! నీకు జోల. పరిమళం నిండుగా ఉండే కేశపాశాన్ని కల నా కుమారా! నీకు జోల – అని ఈవిధంగా పలు మార్లు పల్కి, నా నోరు ఆనందించేటట్లుగా (నోరార) నిన్ను జోలపాడే సంపద లేని తల్లులలో కడపటి తల్లిని.

**వడిక్కోళఞ్జన మెఴుతు శెమ్మలర్‌క్కణ్ మరువి మేలినితొన్ఱినై నోక్కి,**
**ముడక్కి చ్చేవడి మలర్‌చ్చిఱు కరున్దాళ్ పొలియుమ్ నీర్ ముకిఴ్కుఴవియే పోల,**
**అడక్కియార చ్చెఙ్జిఱు విరలనైత్తుమ్ అఙ్గైయోడు అణైన్దు ఆనైయిత్కిడన్ద,**
**కిడక్కై కణ్డిడ ప్పెఱ్ఱిలేన్ అన్దో! కేశవా! కెడువేన్ కెడువేనే 2**

నైశిత్యాన్ని (పదునును) కల్గిన, కాటుక పూయబడిన, ఎఱ్ఱతామరలో సాటి వచ్చే తిరునేత్రాలతో మేలుకట్టులో వేలాడే ఒక క్రీడాపరికరాన్ని భోగ్యంగా, పొందికగా చూస్తూ, నల్లని పైపాదాలను, ఎఱ్ఱ తామరలవంటి ఎఱ్ఱని అరికాళ్ళను కల శ్రీచరణాలను మడచుకొని, ఆకంఠం నీటిని తాగి ప్రకాశించే, పిల్ల మేఘంవలె అందమైన చిన్ని వేళ్ళను అన్నిటిని అరచేతిలో అణగి ఉండేటట్లు మడచి పట్టుకొని, ఏనుగు కూర్చున్నట్లుగా నీవు పరుండిన అందాన్ని, దర్శించి ఆనందించలేకపోయాను. అయ్యో! కేశసౌందర్యాన్ని కలవాడా! ఏ ఒక్కటినీ అనుభవించలేని మహాపాపిని అయ్యానే!

**మున్నై నమ్మఱైయన్బుడై మకళిర్ ముఱై ముఱై తన్దఙ్గుఱఙ్గిడై యిరుత్తి,**
**ఎన్నైయే! ఎన్ఱన్ కులప్పెరుఞ్జుడరే! ఎఴు ముకిల్ కణత్తెఴిల్‌కవరేఱే!,**
**ఉన్నై యావన్ ఎన్నురైప్ప నిన్ శెఙ్గేఴ్ విరలినుమ్ కడైక్కణ్ణినుమ్ కాట్ట,**
**నన్దన్ పెఱ్ఱనన్ నల్వినై ఇల్లా నఙ్గళ్‌కోన్ వశుతేవన్ పెఱ్ఱిలనే 3**

ప్రేమను కలవారైన, పరంపరగా ఉండే చక్కని సంబంధబాంధవ్యాలను కలవారైన స్త్రీలు తమ తమ ఒడిలో ఒకరి తర్వాత ఇంకొకరు పెట్టుకొని, “ఓ తండ్రీ! మా కులానికి

గొప్ప దీపం వంటివాడా! ఏడు విధాలైన మేఘసమూహాల అందాన్ని పుణికి పుచ్చుకొన్న సింహవంటివాడా!" (అని పలు విధాలుగా స్తుతించి), "నీ తండ్రి ఎవరో చూపించు" అని అనగానే, నీ ఎఱ్ఱని వర్ణాన్ని కల వేళ్ళతో, కడగంటి చూపులతో నీవు చూపించగా, (ఆ భాగ్యాన్ని) నందగోపాలుడు పొందాడు. భాగ్యహీనను అయిన నా భర్త వసుదేవుడు పొందలేకపోయాడే!

**కళినిలా ఎ*ళి*ల్ మతిపురై ముకముమ్ కణ్ణనే! తిణ్ణై మార్వుమ్ తిణ్డోళుమ్,**
**తళిర్ మలర్ క్కరుఞ్జు*ళ*ల్ పిఱై యతువుమ్ తడఙ్గొళ్ తామరైక్కణ్ణళుమ్ పొలిన్ద,**
**ఇళమైయిన్బత్తై ఇయిన్నెన్తన్ కణ్ణాల్ పరుకువేఱ్కివళ్ తాయెన నినైన్ద,**
**అళవిల్ పిళ్ళమై ఇన్బత్తై ఇ*ళ*న్ద పావియేన్ ఎనతావి నిల్లాతే** 4

శ్రీకృష్ణా! ఆనందాన్ని కల్గించే వెన్నెలను కల, పూర్ణచంద్రునితో పోలిన తిరుముఖాన్ని, బలిష్ఠాలైన చేతులను, వక్షఃస్థలాన్ని, దృఢమైన బాహువులను, లేలేత చిగుళ్ళను పూలను కల నల్లని కేశపాశం కింద వెలిగే తృతీయాతిథి చంద్రునివంటి ఫాలభాగాన్ని, విశాలం అయిన తామరపూలవంటి తిరునేత్రాలను (అనే వీటిని) కల్గిన అందంతో వెలిగేటట్లుండే నీ యౌవనశోభను ఇపుడు నా కళ్ళతో పానం చేసే నాకు, 'ఈమె నా తల్లి" అని తెలిసేటట్లుగా, ఆనందాన్ని (అనుభవించలేక) కోల్పోయిన పాపిని అయిన నా ప్రాణం ధరించి ఇక నిలువలేదు.

**మరువి నిన్ తిరునె*ఱ్ఱి*యిల్ శుట్టి యశై తర మణివాయిడై ముత్తమ్**
**తరుతలుమ్, ఉన్తన్ తాతైయై ప్పోలుమ్ వడివు కణ్డుకొణ్డు ఉళ్ళముళ్ కుళిర,**
**విరలై చ్చెఞ్జీఱు వాయిడై చ్చేర్త్తు వెకుళియాయ్ నిన్ఱురైక్కు మవ్వురైయుమ్,**
**తిరువిలేన్ ఒన్ఱుమ్ పె*ఱ్ఱి*లేన్ ఎల్లామ్ తెయ్వనఙ్గై యశోతై పె*ఱ్ఱా*ళే** 5

నీ ఫాలభాగంలో పొందికగా వెలిగే చుట్టు (ఆభరణం) కదలాడేటట్లుగా అందమైన నోటితో ముద్దును ఇవ్వడం, నీ తండ్రి శరీరంతో పోలిన నీ శరీరసౌందర్యాన్ని నేను దర్శించి ఆనందించేటట్లుగా, మనస్సులోపల చల్లబడేటట్లుగా, ఎఱ్ఱని చిన్న నోటిలో వేళ్ళను పెట్టుకొని (నీవు) కోపంతో నిలచి పలికే ముద్దు మాటలు – అనే వీనిలో ఏ ఒక్కటినీ భాగ్యహీనను అయిన నేను అనుభవించలేకపోయానే! దైవకాంత అనదగిన యశోదాదేవి ఆ బాల్యచేష్టితాలను అన్నిటినీ అనుభవించగల్గింది.

**తణ్ణమ్ తామరై క్కణ్ణనే! కణ్ణా! తవ*ళ్*న్దె*ళు*న్దు తళర్న్దతోర్ నడైయాల్,**
**మణ్ణిల్ శెమ్బొడి యాడి వన్దు ఎన్తన్ మార్పిల్ మన్నిడ ప్పె*ఱ్ఱి*లేన్ అన్దో!,**



**వణ్ణమ్ శెఞ్జీఱు కైవిరలనైత్తుమ్ వారి వాయ్క్కొణ్డ అడిశిలిన్ మిచ్చిల్,**
**ఉణ్ణ ప్పె*ఱ్ఱి*లేన్ ఓ! కొడువినైయేన్ ఎన్నై ఎన్ శెయ్య ప్పె*ఱ్ఱ*తు ఎమ్మోయే** 6

చల్లని, అందమైన తామరపూలవంటి తిరునేత్రాలను కలవాడా! శ్రీకృష్ణా! నీవు దోగాడుతూ లేచి, తడబాటుతో కూడిన బుడిబుడి నడకలతో ఎఱ్ఱని బూడిదమన్నులో క్రీడించి, (ఆ సన్నివేశంతోనే) వచ్చి నా వక్షఃస్థలాన్ని నీవు కౌగలించుకొనే భాగ్యాన్ని పొందలేకపోయాను. ఏమి నా దౌర్భాగ్యం! అందంతో కూడిన, ఎఱ్ఱని చిన్న వేళ్ళు అన్నిటితోను ఆదరంగా తీసికొని నోటిలో పెట్టుకొన్న ప్రసాదంయొక్క శేషాన్ని నేను భుజించలేకపోయాను. అయ్యో! మహాపాపిని అయ్యాను. నా తల్లి నన్ను ఎందుకోసం కన్నదో!

**కు*ళ*కనే! ఎన్తన్ కోమళప్పిళ్ళాయ్! కోవిన్దా! ఎన్ కుడఙ్గైయిల్ మన్ని,**
**ఒ*ళు*కు పేరిళఞ్జీఱు తళిర్పోల్ ఒరు కైయాల్ ఒరుములై ముకమ్ నెరుడా,**
**మ*ళ*లై మెన్నకై యిడై యిడై యరుళా వాయిలే ములై యిరుక్క ఎన్ ముకత్తే,**
**ఎ*ళి*ల్ కొళ్ నిన్ తిరుక్కణ్ణినై నోక్కన్దన్నైయుమ్ ఇ*ళ*న్దేన్ ఇ*ళ*న్దేనే** 7

అందటితో కలిగే స్వభావాన్ని కలవాడా! నా అందంలో సాటిలేని కుమారా! (సుకుమారుడవైన నా కుమారా!) గోవిందా! నా చేతిలో పొందికగా ఉండి, ఉప్పొంగి ప్రవహించే రీతిలోని అందాన్ని కల్గినది, చాలా మెత్తని లేత చిగురువంటిది అయిన ఒక శ్రీహస్తంతో ఒక చూచుకాన్ని ఒత్తుతూ, ఇంకొక చూచుకాన్ని (నీ) నోటిలో ఉండగా, మధ్య మధ్యలో అపుడపుడు నా ముఖాన్ని చూస్తూ, చిఱునవ్వు నవ్వుతూ ఉండే నీ రెండు తిరునేత్రాలతో నీవు చూచే అందమైన చూపును, అయ్యో! కోల్పోయాను! కోల్పోయాను! అయ్యో!

**ము*ళు*తుమ్ వెణ్ణై యళైన్దు తొట్టుణ్ణుమ్ ముకి*ళి*ళఞ్జీఱు త్తామరైక్కైయుమ్,**
**ఎ*ళి*ల్కొళ్ తామ్బుకొణ్డు అడిప్పతఱ్కు ఎళ్కు నిలైయుమ్ వెణ్డయిర్ తోయ్న్ద శెవ్వాయుమ్,**
**అ*ళు*కైయుమ్ అఞ్జినోక్కుమ్ అన్నోక్కుమ్ అణి కొళ్ శెఞ్జీఱు వాయ్ నెళిప్పతువుమ్,**
**తొ*ళు*కైయుమ్ ఇవై కణ్డ అశోతై తొల్లైయిన్బత్తు ఇఱుతి కణ్డాళే** 8

కుండలో ఉన్న వెన్నను అంతటిని చేతులార పైకి తీసి తడవుతూ, భుజించే లేలేత చిగురువంటివి, తామరపూవువంటివి అయిన చిన్న చిన్న శ్రీహస్తాలు, అందమైన దారంతో కట్టగా (దానికి) భయపడి నిలచిన స్థితి, వెన్న, పెరుగు పూసికొన్న ఎఱ్ఱని నీ నోరు, ఏడుపు, భయపడి చూచే ఆ చూపు, అందమైన ఎఱ్ఱని అధరం అదరడం, అంజలిని చేయడం – (అనే) వీనిని దర్శించి, ఆనందించగల్గిన యశోదాదేవి అంతు లేని మహానందంయొక్క అవధిని చూచింది.

**కున్డినాల్ కుడై కవిత్తతుమ్ కోల క్కురవై కోత్తతుమ్ కుడమాట్టుమ్,**
**కన్డినాల్ విళవు ఎఱిన్దతుమ్ కాలాల్ కాళియన్ తలైమితిత్తతుమ్ ముతలా,**
**వెన్ఱి శేర్ పిళ్ళై నల్విళైయాట్టమ్ అనైత్తిలుమ్ అఙ్గెన్నుళ్ళ ముళ్ కుళిర,**
**ఒన్ఱుమ్ కణ్డిడ ప్పె*ఱ్ఱి*లేన్ అడియేన్ కాణుమాఱు ఇని ఉణ్డెనిల్ అరుళే. 9**

గోవర్ధనపర్వతాన్ని గొడుగుగా నిలుపడం, అందంగా రాసక్రీడను ఆడడం, కుంభనృత్యాన్ని చేయడం, లేగదూడలో ఆవేశించిన అసురునితో వెలగపండులోని అసురుని వధించడం, శ్రీచరణాలతో కాళియుని శిరస్సును అణగతొక్కడం – మొదలైన విజయంతో కూడిన గొప్పదైన బాల్యలీలను ఏ ఒక్కటినీ నామనస్సు ఆనందించి చల్లబడేటట్లుగా నేను రేపల్లెలో ఉండి దర్శించలేకపోయాను, ఇకపై అయినా నేను దర్శించే దారి ఉంటే అనుగ్రహించు.

**వఞ్జ మేవియ నెఞ్జుడై ప్పేయ్చ్చి వరణ్డునార్ నరమ్బొ*ఴు* క్కరిన్దుక్క,**
**నఞ్జమార్ తరు శు*ఴి*ములై యన్దో! శువైత్తు నీ అరుళ్ శెయ్తు వళర్న్దాయ్,**
**కఞ్జన్నాళ్ కవర్ కరుముకిలెన్దాయ్! కడైప్పట్టేన్ వెఱితే ములై శుమన్దు,**
**తఞ్జమేల్ ఒన్ఱిలేన్ ఉయ్న్దిరున్దేన్ తక్కతే నల్లతాయై ప్పె*ఱ్ఱా*యే 10**

వంచనతో కూడిన మనస్సును కల్గినదైన పూతన అనే పిశాచియొక్క, (శరీరంలో మాంసం, రక్తం) పాలతో పాటుగా వెలువడేటట్లు, ఆమె తోలు నరాలు కింద పడేటట్లు, మిక్కిలి విషాన్ని కల్గిన తన పట్ల ఆకర్షించే ఆమె స్తన్యాన్ని నీవు ఆరగించి పెరిగావు. ఆశ్చర్యం! కంసుని ఆయుస్సును అపహరించిన నీలమేఘశ్యామా! (నేను) వ్యర్థంగా స్తనాలను మోస్తూ అధమలలో అధమను అయ్యాను. (నిన్ను తప్ప వేఱు) గతిలేని దాననుగా ఉన్నాను. (నిన్ను చూడాలని) ప్రాణాలను బిగపట్టుకొని జీవిస్తున్నాను. నీకు తగిన మంచి తల్లిని నీవు పొందావు.

**మల్లై మానకర్క్కు ఇఱైయవన్తన్నై వాన్ శెలుత్తి వన్దీఙ్గనమాయత్తు,**
**ఎల్లైయిల్ పిళ్ళై శెయ్వన కాణా త్తెయ్వ త్తేవకి పులమ్బియ పులమ్బల్,**
**కొల్లి కావలన్ మాలడిముడిమేల్ క్కోలమామ్ కులశేకరన్ శొన్న,**
**నల్లిశై త్తమి*ఴ్*మాలై వల్లార్కళ్ నణ్ణువార్ ఒల్లై నారణనులకే 11**

మిక్కిలి ఐశ్వర్యాన్ని కల్గిన, నగరం అయిన శ్రీమధురకు అధిపతి అయిన కంసుని వీరస్వర్గానికి పంపి, రెపల్లెకు వచ్చి ఈ విధంగా, అంతులేని ఆశ్చర్యచేష్టితాలను చేసిన శ్రీకృష్ణుని లీలలను దర్శించలేనిదై, దివ్యత్వాన్ని నిండుగా కల దేవకీదేవి విలపించిన విలాపాలను అనుకరిస్తూ సర్వేశ్వరుని శ్రీచరణాలను తమ తలలో



అలంకారంగా అలంకరించుకొన్న కులశేఖరా*ఴ్వా*ర్లు పల్కిన తీయని రాగాలను కల ద్రావిడపాశురాలను అభ్యసించగల్గినవారు శీఘ్రంగా పరమపదాన్ని పొందగలరు.

## ఎనిమిదవ దశకం

శ్రీకౌసల్యాదేవి పొందిన అనుభవాన్ని తాము ఆ సమయంలో పొందలేకపోయి నందువల్ల, ఆ అనుభవాన్ని తిరుక్కణ్ణపురంలోని స్వామి సమక్షంలో ఆ*ఴ్వా*ర్లు ఈ దశకంలో అనుభవిస్తున్నారు.

**మన్ను పుక*ఴ్* క్కౌశలైతన్ మణివయిఱు వాయ్త్తవనే!,**
**తెన్నిలఙ్గై క్కోన్ ముడికళ్ శిన్దువిత్తాయ్! శెమ్బొన్ శేర్,**
**కన్నినన్ మామతిళ్ పుడైశూ*ఴ్* కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఎన్నుడైయ ఇన్నముతే! ఇరాకవనే! తాలేలో! 1**

స్థిరంగా నిలచి ఉండే కీర్తిని కల కౌసల్యయొక్క అందమైన గర్భంలో కుమారుడుగా అవతరించినవాడా! దక్షిణదిక్కులో ఉండే లంకకు అధిపతి అయిన రావణుని పది తలలను (బాణాలతో) చెదఱిపడేటట్లు చేసినవాడా! ఎఱ్ఱని బంగారంతో చేయబడిన, నాశరహితమైన, అందమైన, పెద్దవి అయిన కోటలతో చుట్టూ ఆవరింపబడి ఉండే తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉన్నవాడవైన, నా కంటి నల్లని కనుగుడ్డువంటివాడా! నాకు భోగ్యమైన అమృతమా! శ్రీరామా! నీకు జోల.

**పుణ్డరీక మలరతన్మేల్ ప్పువని ఎల్లామ్ పడైత్తవనే!,**
**తిణ్డిఱలాళ్ తాడకైతన్ ఉర మురువ చ్చిలై వళైత్తాయ్!,**
**కణ్డవర్తమ్ మనమ్ వ*ఴు*ఙ్గుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఎణ్డిశైయుమ్ ఆళుడైయాయ్! ఇరాకవనే! తాలేలో! 2**

(తిరునాభిలో పూచిన) తామరపూవులో లోకాలను అన్నిటినీ సృష్టించినవాడా! దృఢమైన, బలాన్ని కల తాటకయొక్క వక్షస్సు భగ్నం అయేటట్లుగా వింటిని వంచి బాణాలను ప్రయోగించినవాడా! నిన్ను దర్శించినవారు, తమ మనస్సును తామే స్వయంగా అంగీకరించి, అర్పించే రీతిలో తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే నా నీలమాణిక్యమా! ఎనిమిది దిక్కులలో ఉన్నవారిని దాసులుగా కల్గినవాడా! రాఘవా! (నీకు) జోల.

**కొఙ్గు మలి కరుఙ్గు*ఴ*లాళ్ కౌశలైతన్ కులమతలాయ్!,**
**తఙ్గు పెరుమ్ పుక*ఴ్* చ్చనకన్డిరుమరుకా! తాశరతీ!,**

**కజ్జైయిలుమ్ తీర్త్తమలి కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఎజ్గళ్ కులత్తిన్నముతే! ఇరాకవనే! తాలేలో!** 3

పరిమళం అతిశయించి ఉండే నల్లని కేశాలను కల కౌసల్యాదేవియొక్క కులానికి ఉత్తారకా! గొప్ప కీర్తిని పొందికగా కల జనకమహారాజుకు అల్లుడా! పరిశుద్ధత మిక్కిలిగా కల్గిన తీర్థాలను కల తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే నా నీలమాణిక్యమా! మా రాజవంశానికి అంతటికీ పరమభోగ్యం అయిన అమృతంవంటివాడా! రాఘవా! నీకు జోల.

**తామరైమేల్ అయనవనై ప్పడైత్తవనే!, తయరతన్తన్**
**మామతలాయ్! మైతిలితన్ మణవాళా!, వణ్డినజ్గళ్**
**కామరజ్గళ్ ఇశై పాడుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఏమరు వెజ్జిలై వలవా! ఇరాకవనే! తాలేలో!** 4

తిరునాభీపద్మంలో బ్రహ్మను సృష్టించినవాడా! దశరథుని జ్యేష్ఠకుమారా! సీతాదేవికి వల్లభుడా! తుమ్మెదలు **"కామరమ్"** అనే రాగాలను పాడే తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే నా నీలమాణిక్యమా! తనను పట్టుకొన్నవారు ఎవరైనా వారిని బాణప్రయోగంలో ప్రేరేపించే భయంకరం అయిన శ్రీశార్ఙ్గం అనే వింటిని ఏలగలవాడా! రాఘవా! నీకు జోల.

**పారాళుమ్ పడర్ శెల్వమ్ పరతనమ్బిక్కే అరుళి,**
**ఆరావన్బిళైయవనోడు అరుజ్గానమ్ అడైన్దవనే!,**
**శీరాళుమ్ వరైమార్పా! తిరుక్కణ్ణపురత్తరశే!,**
**తారారుమ్ నీళ్ ముడి! ఎన్ తాశరతీ! తాలేలో!** 5

భూమిని అంతటినీ పరిపాలించడం అనే గొప్ప రాజ్యలక్ష్మిని సద్గుణాలు నిండిన భరతాఴ్వాన్‌కే అనుగ్రహించి, కొఱత లేని ప్రేమను కల లక్ష్మణునితో పాటుగా ఎవరికీ ప్రవేశించడానికి సాధ్యం కాని అరణ్యానికి పోయినవాడా! వీరలక్ష్మికి నివాసస్థానం అయిన పర్వతంవంటి వక్షఃస్థలాన్ని కలవాడా! తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే ప్రభూ! పూమాలికలతో కూడిన దీర్ఘమైన కిరీటాన్ని కల నా శ్రీరామా! నీకు తాలాట్టు.

**శుఱ్ఱమెల్లామ్ పిన్ తొడర త్తొల్ కాన మడైన్దవనే!,**
**అఱ్ఱవర్కట్కు అరుమరున్దే! అయోత్తినకర్క్కు అతిపతియే!,**



**కఱ్ఱవర్కళ్ తామ్ వాఴుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**శిఱ్ఱవైతన్ శొల్కొణ్డ శీరామా! తాలేలో!** 6

బంధువులందఱు వెంబడించి రాగా ప్రాచీనమైన అడవికి వేంచేసినవాడా! నీకు విధేయులైన భక్తులకు అరుదైన ఔషధమా! అయోధ్యకు అధిపతీ! వేదశాస్త్రా లను అభ్యసించి తెలిసిన జ్ఞానులు నివసించే తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, నాకు భోగ్యమైన నీలమాణిక్యమా! చిన్నతల్లి అయిన కైకేయియొక్క మాటను పరిగ్రహించిన శ్రీరామా! (నీకు) జోల.

**ఆలినిలై ప్పాలకనాయ్ అన్ఱులకమ్ ఉణ్డవనే!,**
**వాలియై క్కొన్ఱు అరశు ఇళైయ వానరత్తుక్కు అళిత్తవనే!,**
**కాలిన్ మణికరై అలైక్కుమ్ కరణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఆలినకర్క్కు అతిపతియే! అయోత్తిమనే! తాలేలో!** 7

ప్రళయం వచ్చిన ఆ సమయంలో ఒక మఱ్ఱి చిగురులో బాలకుని రూపంలో అన్ని లోకాలను ఉదరంలో పెట్టుకొని రక్షించినవాడా! వాలిని వధించి, అతని తమ్ముడైన సుగ్రీవునకు రాజ్యాన్ని ఇచ్చినవాడా! వాయువు, (సముద్రంలో ఉండే) మణులను తీరానికి తీసికొనివచ్చి పోగు చేసే తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, నాకు భోగ్యమైన నల్లని మాణిక్యమా! తిరువాలినగరానికి నిర్వాహకుడా! అయోధ్యా నగరాధిపా! నీకు తాలాట్టు.

**మలైయతనాల్ అణై కట్టి మతిళిలజ్గై అఴిత్తవనే!,**
**అలైకడలై క్కడన్దు అమరర్క్కు అముతరుళిచ్చెయ్‌వనే!,**
**కలైవలవర్తామ్ వాఴుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**శిలైవలవా! శేవకనే! శ్రీరామా! తాలేలో!** 8

పర్వతాలతో సేతుబంధాన్ని చేసి, అగడ్తలను కల లంకను నాశనం చేసినవాడా! అలలు ఎగిసిపడే క్షీరాబ్ధిని చిలికి, దేవతలకు అమృతాన్ని అనుగ్రహించినవాడా!, అన్ని శాస్త్రాలను అధ్యయనం చేసిన విజ్ఞులు నివసించే తిరుక్కణ్ణపురంలోని, నాకు భోగ్యుడవైన ఓ నీలమాణిక్యమా! శ్రీశార్ఙ్గమనే వింటిని వంచడంలో సామర్థ్యాన్ని కలవాడా! వీరా! శ్రీరామా! నీకు తాలాట్టు.

**తళై యవిఴుమ్ నఱుఙ్గుఞ్జి త్తయరతన్తన్ కులమతలాయ్!,**
**వళైయ ఒరు శిలైయతనాల్ మతిళిలజ్గై అఴిత్తవనే!,**

**క్షై క*ళు*నీర్ మరుజ్గలరుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఇళైయవర్కట్కు అరుళుడైయాయ్! ఇరాకవనే! తాలేలో!** 9

కట్టు తెంచుకొని వెలువడే సువాసనను కల కేశబంధంతో కూడిన దశరథ చక్రవర్తియొక్క కులానికి ఉత్తారకడైనవాడా! సాటి లేని విల్లును వంచి, ఆ వింటితో కోటలను కల లంకను నాశనం చేసినవాడా! కలుపువలె తీసివేయబడ్డ ఎఱ్ఱ తామర పూలు చుట్టూ వికసించే తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, నాకు భోగ్యుడవైన నీలమాణిక్యమా! తమ్ముల విషయంలో చాలా ప్రేమను పొందికగా కలవాడా! రాఘవా! నీకు జోల.

**తేవరైయుమ్ అశురరైయుమ్ తిశైకళైయుమ్ పడైత్తవనే!,**
**యావరుమ్ వన్దు అడి వణజ్గ అరజ్గనకర్ తుయిన్టవనే!,**
**కావిరి నన్నతి పాయుమ్ కణపురత్తు ఎన్ కరుమణియే!,**
**ఏవరి వెఞ్జిలై వలవా! ఇరాకవనే! తాలేలో!** 10

దేవతలను, (వారికి ఆగర్భశత్రువులైన) అసురులను, పలు దిక్కులలో ఉండే లోకాలను సృష్టించినవాడా! జీవరాసులంతా వచ్చి శ్రీచరణాలలో సేవించేటట్లుగా శ్రీరంగనగరంలో కన్నులు మూసికొని తూగేవాడా! శ్రేయస్సును కల్గించే కావేరీనది ప్రవహించే తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉండే, నాకు భవ్యమైన నీలమాణిక్యమా బాణప్రయోగంలో ప్రేరేపించేదై, అందమైనదై, (శత్రువులకు) భయాన్ని కల్గించేదైన వింటిని పాలించగలవాడా! రాఘవా! నీకు జోల.

**కన్నినన్ మామతిళ్ పుడై శూ*ళ్* కణపురత్తు ఎన్ కాకుత్తన్**
**తన్నడిమేల్, తాలేలో ఎన్టురైత్త తమి*ళ్*మాలై,**
**కొన్న విలుమ్ వేల్ వలవన్ కుడై క్కులశేకరన్ శొన్న,**
**పన్నియ నూల్ పత్తుమ్ వల్లార్ పాజ్గాయ పత్తర్కళే** 11

నా శ్రీరాముని శ్రీచరణాల విషయంలో కౌసల్యాదేవి జోలపాడినట్లుగా పల్కిన పాశురాలను (శత్రువులను) వధించడంలో అభినివేశాన్ని కల, వేలాయుధాన్ని కల్గిన, అధికారచిహ్నం అయిన శ్వేతచ్ఛత్రాన్ని కల్గిన కులశేఖరా*ళ్వా*ర్లు నశించనివి, గొప్పవి, అందమైనవి, పెద్దవి అయిన కోటలచే నాల్గు వైపుల చుట్టబడిన తిరుక్కణ్ణపురంలో అనుగ్రహించిన, విస్తృతమైన, విలక్షణమైన, ద్రావిడంలో అనుగ్రహింపబడ్డ మాలిక అయిన పది పాశురాలను అభ్యసించగలవారు అతనిని అనుభవించదగిన భక్తులు కాగలరు.



# తొమ్మిదవ దశకం

తన కుమారుల బాల్యావస్థలను అన్నిటినీ అనుభవించి, వారు యౌవనాన్ని పొందగానే ఆ దశను అనుభవించలేక కోల్పోయిన దశరథ చక్రవర్తివలె, తమకు కూడా భగవానునితో సంబంధం ఇతరులతోపాటు సమానం కనుక, ఆ అనుభవాన్ని పొందలేనందువల్ల, “అయ్యో! కోల్పోయానే!” అనే క్లేశంతో దశరథుడు పలికే మాటల రూపంలో ఆ*ళ్వా*ర్లు ఈ దశకంలో పల్కుతున్నారు.

**వన్టాళినిణై వణజ్గి వళనకరమ్ తొ*ళు*తేత్త మన్ననావాన్**
**నిన్టాయై, అరియణై మేలిరున్దాయై నెడుజ్గానమ్ పడరప్పోకు**
**వెన్టాళ్, ఎమ్మిరామా! వో! ఉనై ప్పయన్ద కైకేశితన్ శొల్కేట్టు,**
**నన్టాక నానిలత్తై యాళ్విత్తేన్ నన్మకనే! ఉన్నై నానే** 1

మా శ్రీరామా! (శరణు పొందినవారిని చేయి విడువక రక్షించే) బలిమిని నిండుగా కల శ్రీమన్నారాయణుని రెండు శ్రీచరణాలలో నీవు నమస్కరించి ఆశ్రయించి, బలాన్ని కల అయోధ్యాపుర జనులు, చేతులను జోడించి స్తుతించగా, ప్రభువై పట్టాభిషేకాన్ని చేసికోవడంకోసం సిద్ధంగా ఉన్నవాడవు, సింహాసనంపై అధిరోహించ బోయేవాడవు అయిన నిన్ను “దుర్గమం అయిన అరణ్యానికి పో” అను కైకేయి పల్కింది. నా మాటను జవదాటని ఓ కుమారా! దశరథుణ్ణి అయిన నేను నిన్ను కన్న కుమారునిగా భావించిన కైకేయి మాటను విని, చాలా అందంగా నిన్ను ఈ భూమిని పాలించేటట్లుగా చేశానే! (అయ్యో!)

**వెవ్వాయేన్ వెవ్వురై కేట్టు ఇరు నిలత్తై వేణ్డాతే విరైన్దు, వెన్టి**
**మైవాయ కళిఱొ*ళి*న్దు తేరొ*ళి*న్దు మా వొ*ళి*న్దు వనమే మేవి,**
**నెయ్ వాయ వేల్ నెడుజ్గణ్ నేరి*ళై*యుమ్ ఇళజ్గోవుమ్ పిన్బు పోక,**
**ఎవ్వాఱు నడన్దనై ఎమ్మిరామా! వో! ఎమ్బెరుమాన్! ఎన్ శెయ్కేనే.** 2

మా శ్రీరామా! కఠినమైన వాక్కును కల నా కఠినోక్తులను విని, విశాలమైన భూమిని పాలించడాన్ని కోరకుండా విడిచిపెట్టి, చాలా శీఘ్రంగా విజయాన్ని ఇచ్చేవి, కాటుక కొండవలె గొప్ప రూపాన్ని కల్గినవి అయిన ఏనుగులను విడిచి, రథాలను విడిచి, అశ్వాలను విడిచి, అరణ్యాన్ని చేరి, నేతిని పూసిన మొనలను కల వేలాయుధ వంటి విశాలమైన నేత్రాలను, తగిన ఆభరణాలను కల సీతాదేవి, లక్ష్మణుడు నిన్ను వెంబడించి రాగా, (కాలినడక తెలియని) నీవు ఏ రీతిలో వనానికి నడచివెళ్ళావో! నా స్వామీ! నేను ఏమి చేయను?

**కొల్లణైవేల్ వరి నెడుఙ్గణ్ కౌశలైతన్ కులమతలాయ్! కుని విల్లేన్దుమ్,**
**మల్లణైన్దవరైత్తోళా! వల్వినైయేన్ మనమురుక్కుమ్ వకైయే కऱ్ऱాయ్!,**
**మెల్లణైమేల్ మున్ తుయిన్ఱాయ్! ఇన్ఱిని ప్పోయ్ వియన్ కాన మరత్తిన్ నీழల్,**
**కల్లణైమేల్ కణ్డుయిల కऱ్ऱనైయో! కాకుత్తా! కరియకోవే! 3**

వధించే వృత్తిలో అభినివేశాన్ని కల వేలాయుధంవంటి, ఎఱ్ఱని నల్లని రేఖలను, వైశాల్యాన్ని కల నేత్రాలను కల్గిన కౌసల్యాదేవియొక్క కులానికి ఉత్తారకుడైనవాడా! వంచిన వింటిని ధరించిన, బలం నిండుగా కల పర్వతాలవంటి బాహువులను కలవాడా! మహాపాపి అయిన నాయొక్క మనస్సును (నీ ఆయుధసౌందర్యంతో, బాహుసౌందర్యంతో) కఱిగేటట్లు చేసినవాడా! కకుత్థ్సవంశంలో జన్మించినవాడా! నీలమేఘ వర్ణుడవైన స్వామీ! మృదువైన శయ్యలో పూర్వం పరుండి నిద్రించే నీవు, ఇప్పటినుండి ఇక రాబోయే కాలం అంతా అరణ్యానికి పోయి, కఠినమైన ఆ అరణ్యం లోని (ఆకులు లేని) చెట్లనీడలలో శిలలనే శయ్యలుగా చేసికొని నిద్రించడం నేర్చావా!

**వా పోకు వా ఇన్నమ్ వన్దొరు కాల్ కణ్డు పో మలరాళ్కూన్దల్,**
**వేయ్ పోలు మెழిల్ తోళితన్ పొరుట్టా విడైయోన్ఱన్ విల్లై చ్చెऱ్ऱాయ్!,**
**మాపోకు నెడుఙ్గానమ్ వల్వినైయేన్ మన మురుక్కుమ్ మకనే!, ఇన్ఱు**
**నీ పోక ఎన్నెఞ్జమ్ ఇరు పిళవాయ్ ప్పోకాతే నిఱ్కుమాఱే! 4**

ఇక్కడకు కొంచెం రా. ఇక నీవు వెళ్ళు. తిరిగి మళ్ళీ ఇక్కడకు రా. (వచ్చిపోయే టపుడు) తిరిగి ఒకసారి నన్ను చూచి పో. పూలను ఎల్లప్పుడూ అలంకరించుకొన్న కేశాలను కల్గిన, వెదుళ్ళవంటి అందమైన బాహువులను కల సీతాదేవికోసంగా శివుని ధనస్సును విఱిచినవాడా! మహాపాపి అయిన నా మనస్సును ద్రవీకరింపజేసే కుమారా! ఇపుడు నీవు ఏనుగులు సంచరించే మహారణ్యానికి పోయినా, నా మనస్సు రెండుగా పగిలి పోకుండా మిగిలి ఉన్నదే! ఆశ్చర్యం!

**పొరున్దార్ కైవేల్ నుతిపోల్ పరల్ పాయ మెల్లడిక్కళ్ కురుతి శోర,**
**విరుమ్బాత కాన్ విరుమ్బి వెయిలుఱైప్ప వెమ్బశినోయ్ కూర, నిన్ఱు**
**పెరుమ్బావియేన్ మకనే! పోకిన్ఱాయ్ కేకయర్కోన్మకళాయ్ ప్పెऱ్ऱ,**
**అరుమ్బావి శొల్కేట్ట అరువినైయేన్ ఎన్ శెయ్కేన్! అన్తో! యానే 5**

శత్రువుల హస్తాలలో ఉండే పదును కల వేలాయుధంయొక్క అగ్రంవలె గులకరాళ్ళు కాలిలో నాటుకోగా (గుచ్చుకోగా), మృదువైన పాదాలనుండి రక్తం కారగా, ఎండ పైన తపించగా, క్రూరమైన ఆకలిబాధ కత్తిరించగా (పీడించగా), మహా పాపిని



అయిన నాకు పుట్టిన కుమారా! ఇపుడు, కోరదగని అరణ్యానికి (నేను పొమ్మన్నాను అని) కోరి వెడుతున్నావు. కేకయరాజుకు కుమార్తెగా పుట్టిన, మహాపాపి అయిన కైకేయియొక్క మాటను విన్న క్రూరపాపాన్ని చేసినవాడను. అయ్యో! దీనికి ఏమి పరిహారాన్ని చేయను?

**అమ్మా! ఎన్ఱుకన్దழైక్కుమ్ ఆర్వచ్చొల్కేళాతే అణిశేర్ మార్వమ్,**
**ఎన్మార్వత్తిడై అழున్దత్తழువాతే ముழுశాతే మోవాతుచ్చి,**
**కైమ్మావిన్ నడైయన్న మెన్నడైయుమ్ కమలమ్పోల్ ముకమ్ కాణాతు,**
**ఎమ్మానై ఎన్మకనై ఇழన్దిట్ట ఇழితకైయేన్ ఇరుక్కిన్ఱేనే 6**

"అయ్యా!" అని ఆనందంతో పిలిచే రీతిలోని ప్రేమ నిండిన నా కుమారుని మాటను వినలేకుండా, ఆభరణాలు అలంకరించుకొన్న అతని వక్షఃస్థలాన్ని నా వక్షస్సుతో హత్తుకొనేటట్లుగా గాఢంగా కౌగలించుకోలేక, ఆ ఆనందసముద్రంలో మునగ లేక, అతని శిరస్సును ఆఘ్రాణించలేక, ఏనుగుయొక్క నడకవంటి గంభీరమైన అతని నడకలోని హొయలును, తామరపూవుతో సాటి వచ్చే అతని తిరుముఖ సౌందర్యాన్ని, దర్శించలేక, నన్ను తన నడకల సొబగుతో వ్యామోహపఱచిన నా కుమారుని కోల్పోయిన అధమాధమకృత్యాన్ని చేసిన నేను ఇంకా ప్రాణాలతో ఉన్నానే!

**పూమరువు నఱుఙ్గుఞ్జి పున్శడైయా ప్పునైన్దు పూన్దుకిల్ శేరల్కుల్,**
**కామరెழిల్ విழలుడుత్తు క్కలనణియాతు అఙ్గఙ్గళழకు మాఱి,**
**ఏమరుతొళెన్ పుతల్వన్ యాన్ ఇన్ఱు శెలత్తక్క వనమ్తాన్ శేర్తల్,**
**తూ మఱైయీర్! ఇతు తకవో! శుమన్దిరనే! వశిట్టనే! శొల్లీర్ నీరే 7**

పరిశుద్ధమైన వేదాన్ని అధ్యయనం చేసే బ్రాహ్మణులారా! (మంత్రివి అయిన) ఓ సుమంత్రా! (గురువు అయిన) ఓ వశిష్ఠమహర్షీ! పూలను ఎల్లప్పుడు కల్గినవి, పరిమళం నిండుగా కల్గినవి అయిన కేశాలను వికారమైన జడగా అల్లి, అందమైన పట్టుబట్టను కట్టదగిన నడుములో చూచేవారు కామించదగిన అందమైన విశ్వామిత్రాన్ని దారంగా మడచి ధరించి, ఆభరణాలను అలంకరించుకోకుండా, అందువల్ల తిరుమేనికి కలిగే అందం లేకుండా, శత్రువులు భయపడతగిన బాహువులను కల నా కుమారుడు, అరణ్యానికి భోగాలను అనుభవించవలసిన తాను పోవడం ధర్మమా! (ధర్మాన్ని తెలిసిన) మీరే చెప్పండి.

**పొన్ పెऱ్ऱార్ ఎழిల్ వేత ప్పుతల్వనైయుమ్ తమ్బియైయుమ్ పూవైపోలుమ్,**
**మిన్పऱ్ऱా నుణ్ మరుఙ్గల్ మెల్లియలెన్ మరుకియైయుమ్ వనత్తిల్ పోక్కి,**

**నిన్బన్ఱా నిన్మకన్మేల్ పళి విళైత్తిట్టు ఎన్నైయుమ్ నీళ్వానిల్ పోక్క,**
**ఎన్ పెఱ్ఱాయ్? కైకేశీ! ఇరునిలత్తిల్ ఇనితాక ఇరుక్కిన్ఱాయే** 8

కేకయరాజపుత్రీ! విద్యాసంపదను కల ఆచార్యులవద్దనుండి అందమైన అన్ని వేదాలను, శాస్త్రాలను అభ్యసించిన శ్రీరాముని, (అతనికి) తమ్ముడైన లక్ష్మణుని, పూవై అనే పక్షివంటిది, మెఱపుకూడా సాటి రాని సన్నని నడుమును, మృదువైన స్వభావాన్ని కల్గినది, నా కోడలు అయిన సీతాదేవిని వనానికి పంపి, నీ పట్ల ప్రేమను కల నీ కుమారుడైన భరతునిపై నిందను కలిగేటట్లు చేసి, (పుత్ర శోకంతో) నన్నుకూడా చాలా దూరంలో ఉండే పైలోకానికి పోయేటట్లుగా చేసినందువల్ల, నీవు ఏ ప్రయోజనాన్ని పొందావు? ఆ విశాలమైన భూమిలో సుఖంగా ప్రాణంతో ఇంకా జీవించి ఉన్నావే !

**మున్నొరు నాళ్ మళువాళి శిలై వాఙ్గి అవన్తవత్తై ముఱ్ఱుమ్ శెఱ్ఱాయ్,**
**ఉన్నైయుమ్ ఉన్నరుమైయైయుమ్ ఉన్ మోయిన్ వరుత్తముమ్ ఒన్ఱాక క్కొళ్ళాతు,**
**ఎన్నైయుమ్ ఎన్ మెయ్యురైయుమ్ మెయ్యాక క్కొణ్డు వనమ్బుక్క ఎన్దాయ్!,**
**నిన్నైయే మకనాక ప్పెఱప్పెఱువేన్ ఏళ్ పిఱప్పుమ్ నెడున్దోళ్ వేన్దే!** 9

పూర్వం ఒకానొక సమయంలో పరశువును ఆయుధంగా కల పరశురాముని వింటిని గ్రహించి, అతని తపోబలాన్ని పూర్తిగా (నీ బాణానికి లక్ష్యం చేసి) నశింపజేసిన వాడా! నీ పరత్వాన్ని, నిన్ను పుత్రునిగా పొందిన నేను పొందిన క్లేశాన్ని, నీ తల్లి కౌసల్యకు (నీ విశ్లేషంవల్ల) కల్గిన దుఃఖాన్ని ఒక విషయంగా లెక్కించకుండా, నన్ను, నామాటలో నిజమని తలచి, అరణ్యానికి పోయిన నా తండ్రీ! (రక్షణకోసం అని ఏర్పడిన) గొప్ప బాహువులను కల ప్రభూ! ఇక జన్మించే జన్మలు అన్నిటిలోను నిన్నే కుమారునిగా పొందుతాను.

**తేనకు మామలర్ క్కూన్దల్ కౌశలైయుమ్ శుమిత్తిరైయుమ్ శిన్దై నోవ,**
**క్కూనురువిల్ క్కొడున్దొళుత్తై శొల్ కేట్ట కొడియవళ్తన్ శొఱ్కొణ్డు, ఇన్ఱు**
**కానకమే మిక విరుమ్బి నీ తుఱన్ద వళనకరై త్తుఱన్దు, నానుమ్**
**వానకమే మిక విరుమ్బి ప్పోకిన్ఱేన్ మనుకులత్తార్తఙ్గళ్ కోవే!** 10

వైవస్వత మనువుకులంలో పుట్టిన రాజులలో గొప్పవాడా! తేనె వెలువడే, గొప్ప పూలతో కూడిన కేశాలను కల కౌసల్య, సుమిత్ర అనే ఇద్దఱియొక్క మనస్సు బాధను పొందేటట్లు వక్రమైన (గూని అయిన) శరీరంవలెనే మనస్సుకూడా వక్రంగా కల పరిచారిక మంథర యొక్క మాటను విన్న కఠినురాలైన కైకేయి మాటకు కట్టుబడి, అరణ్యాన్నే చాలా ఆదరించి ఇపుడు నీవు విడిచిన నీ పట్టాభిషేకంకోసం అలంకరింపబడ్డ ఈ అయోధ్యానగరాన్ని నేనుకూడా వీడి, పైలోకాన్నే మిక్కిలిగా ఆశపడి వెళ్ళిపోతున్నాను.



**ఏరార్న్ద కరునెడుమాల్ ఇరామనాయ్ వనమ్బుక్క అతనుక్కు ఆఱ్ఱా,**
**త్తారార్న్ద తడవరైత్తోళ్ తయరతన్ఱాన్ పులమ్బియ అప్పులమ్బల్తన్నై,**
**క్కూరార్న్ద వేల్వలవన్ కోళియర్ కోన్ కుడైక్కులశేకరన్ శొల్చెయ్త,**
**శీరార్న్ద తమిళ్మాలై ఇవై వల్లార్ తీనెఱిక్కణ్ శెల్లార్ తామే** 11

సకలకల్యాణగుణాలతో పూర్ణుడై, నీలవర్ణుడైన సర్వేశ్వరుడు శ్రీరాముడుగా అవతరించి అడవులకు పోగా, ఆ లీలను సహించలేక విజయమాలికలను అలంకరించుకొన్న, బలిష్ఠమైన పర్వతంవంటి బాహువులను కల దశరథచక్రవర్తి శోకించి విలపించిన ఆ విలాపాన్ని మిక్కిలి సూటి అయిన వేలాయుధాన్ని ప్రయోగించడంలో సమర్థులు, ఉఱైయూర్‌కు అధిపతి, శ్వేతచ్ఛత్రాన్ని కలవారైన కులశేఖరాళ్వార్లు అనుగ్రహించిన, గొప్పతనం నిండిన, ద్రావిడమాలిక అయిన పది పాశురాలను అభ్యసించగలవారు చెడ్డదారిలో ప్రవర్తించరు.

# పదవ దశకం

గతంలో తాము పొందిన క్లేశం అంతా కోరేటట్లుగా, శ్రీరాముడు నిత్యసాన్నిధ్యాన్ని కల్గి ఉండే తిరుచిత్తిరకూడమ్ అనే దివ్యదేశంలో, శ్రీరామావతారం మొదలు, ఆ అవతార వృత్తాంతాన్ని అంతటిని శ్రీవాల్మీకి భగవానుడు పల్కి ఆనందించినట్లుగా, ఆళ్వార్లు తమ జ్ఞానవైశద్యంతో సమకాలంలో జరిగినట్లు వానిని మానసికంగా దర్శించి, ఈ దశకంలో పల్కుతున్నారు.

**అఙ్గణెడు మతిళ్ పుదై శూళ్ అయోత్తి యెన్నుమ్**
**అణినకరత్తులకనైత్తుమ్ విళఙ్గుమ్ శోతి,**
**వెఙ్గతిరోన్ కులత్తుక్కు ఓర్ విళక్కాయ్ త్తోన్ఱి**
**విణ్ ముళుతుమ్ ఉయ్యక్కొణ్డ వీరన్ఱన్నై,**
**చ్చెఙ్గణెడుమ్ కరుముకిలై ఇరామన్ఱన్నై**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిర కూడన్దన్నుళ్,**
**ఎఙ్గళ్ తనిముతల్వనై ఎమ్బెరుమాన్ఱన్నై**
**ఎన్ఱుకొలో కణ్ కుళిర క్కాణునాళే!** 1

అందమైన ప్రదేశాలను కల్గినది, ఎత్తైన కోటలచే చుట్టు పరివేష్ఠింపబడినది, అయోధ్య అనే ప్రసిద్ధిని పొందినది అయిన అందమైన నగరంలో, లోకాలను అన్నిటిని ప్రకాశింప జేసే పరంజ్యోతి అయిన నారాయణుడు సూర్యవంశానికి సాటి లేని ఒక దీపంగా వచ్చి అవతరించి, నిత్యసూరులందఱిని (దుఃఖం తీర్చి) ఉజ్జీవింపచేసిన మహావీరుడు, ఎఱ్ఱని నేత్రాలను కల, గొప్ప కాలమేఘాలతో పోలిన రూపాన్ని కలవాడు, అందఱినీ రూపసౌందర్యంతో, నేత్రసౌందర్యంతో ఆనందింపజేసినవాడు, తిల్లైనగరం లోని తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉండే, మా సాటిలేని జగత్కారణభూతుడు, మాకు నాయకుడు అయిన సర్వేశ్వరుని నా నేత్రాలు తృప్తితో దర్శించగలిగే నాడు ఏనాడో?

**వన్దెతిర్న్ద తాడకైతన్ ఉరత్తై క్కీఱి**
**వరు కురుతి పొழி తర ఉన్‌కణై యొన్ఱేవి,**
**మన్దిరఙ్గొళ్ మఱైమునివన్ వేళ్వి కాత్తు**
**వల్లరక్కర్ ఉయిరుణ్డ మైన్దన్ కాణ్మిన్,**
**శెన్దళిర్ వాయ్ మలర్ నకై శేర్ శెழுన్దణ్ శోలై**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**అన్దణర్‌కళ్ ఒరు మూవాయిరవర్ ఏత్త**
**అణిమణియాశనత్తిరున్ద అమ్మాన్ఱానే** 2

కోపించి వచ్చి ఎదిరించిన తాటకయొక్క వక్షస్సును చీల్చి, రక్తం (ప్రవాహంవలె) వెలువడి ప్రవహించేటట్లుగా, బలిమిలో సాటి లేని ఒక బాణాన్ని ప్రయోగించి, అన్ని మంత్రాలను తమలో కల్గినవాడు, వేదాలను తెలిసినవాడు అయిన విశ్వామిత్రముని చేసే యాగాన్ని రక్షించి, (ఆ యాగానికి ఆటంకం కల్గించిన) బలాన్ని కల మారీచ సుబాహులనే రాక్షసుల ప్రాణాలను గ్రసించిన కుఱ్ఱవాడు, ఎఱ్ఱని చిగురుమధ్యలో వికసించిన పూలను కల్గిన, అందమైన చల్లని తోటలను కల్గినదైన తిల్లైనగరంలో ఉండే తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉండేవాడు – అనన్యప్రయోజనులైన మూడు వేలమంది శ్రీవైష్ణవులు స్తుతించగా, సాటి లేని రత్నాలు పొదగబడ్డ సింహాసనంలో వేంచేసి ఉండే! సర్వేశ్వరుడే కదా! తెలిసికోండి.

**శెవ్వరి నల్ కరు నెడుఙ్గణ్ శీతైక్కాకి**
**చ్చినవిడైయోన్ శిలై యిఱుత్తు మழுవాళేన్ది,**
**వెవ్వరి నఱ్చిలై వాఙ్గి వెన్ఱి కొణ్డు**
**వేల్‌వేన్దర్ పకై తడిన్ద వీరన్ఱన్నై,**



**తెవ్వరఞ్జ నెడుమ్బురిశై ఉయర్న్ద పాఙ్గర్**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఎవ్వరి వెఞ్జిలై త్తడక్కై ఇరామన్ఱన్నై**
**ఇఱైఞ్జువార్ ఇణై యడియే ఇఱైఞ్జినేనే** 3

ఎఱ్ఱని రేఖలను కల్గిన, అందమైన, నల్లని, దీర్ఘమైన, నేత్రాలను కల సీతాదేవిని పరిణయం చేసికోవడంకోసం కోపాన్ని కల వృషభానికి వాహనుడైన శివుని వింటిని భగ్నం చేసి, (మిథిలనుండి తిరిగి వచ్చే దారిలో) పరశువు (గండ్రగొడ్డలి) అనే ఆయుధాన్ని కల పరశురాముని భయంకరమైన సుందరమైన గొప్ప వింటిని వంచి (గ్రహించి), (అతనిని) జయించి, మర్యాదను పాలించే ప్రభువుల విరోధిని పోగొట్టిన వీర్యాన్ని కలవాడై, శత్రువులు భయపడేటట్లున్న గొప్ప కోటను, ఉన్నతాలైన అంతస్థులను కల తిల్లై తిరుచ్చిత్తిరకూడమ్‌లో వేంచేసి ఉండే ఇతరులచే ప్రయోగించడానికి అరుదైన, భయంకరమైన వింటిని ఎత్తిన గొప్ప బాహువులను కలవాడైన శ్రీరాముని స్తుతించే భక్తుల శ్రీపాదద్వంద్వానికే నేను నమస్కరిస్తాను.

**తొత్తలర్ పూఞ్జురికుழల్ కైకేశిశొల్లాల్**
**తొన్నకరమ్ తుఱన్దు తుఱైక్కఙ్గై తన్నై,**
**ప్పత్తియుడై క్కుకన్ కడత్త వనమ్బోయ్ ప్పుక్కు**
**ప్పరతనుక్కు ప్పాతుకముమ్ అరశు మీన్దు,**
**శిత్తిరకూడత్తు ఇరున్దాన్ఱన్నై ఇన్ఱు**
**త్తిల్లైనకర్ త్తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఎత్తనైయుమ్ కణ్ కుళిర క్కాణ ప్పెఱ్ఱ**
**ఇరునిలత్తార్‌క్కు ఇమైయవర్ నేరొవ్వార్ తామే.** 4

గుత్తులు గుత్తులుగా పూచిన పూలను కల, గుండ్రని, అందమైన కేశాలను కల కైకేయియొక్క మాటను అనుసరించి, ప్రాచీనమైన రాజ్యాన్ని (నగరాన్ని) విడచిపెట్టి, గంగానది రేవును మిక్కిలి భక్తిని కల గుహుడు దాటించగా, అరణ్యాలలో ప్రవేశించి, (చిత్రకూటంలో) భరతునకు పాదుకలను, రాజ్యాన్ని ఇచ్చి, చిత్రకూటపర్వతంలో వేంచేసి ఉండే శ్రీరాముని ఈకాలంలో తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్ దివ్యదేశంలో కళ్ళు చల్లబడేటట్లుగా దర్శించి అనుభవించిన గొప్ప (విశాలమైన) ఈ భూమిలో ఉండేవారికి నిత్యసూరులు కొంచెంకూడా సాటిరారు.

**వలి వణక్కు వరై నెడున్దోళ్ విరాతై క్కొన్ఱు**
**వణ్డమి*ళ్* మాముని కొడుత్త వరివిల్ వాఙ్గి,**
**క్కలై వణక్కు నోక్కరక్కి మూక్కై నీక్కి**
**క్కరనోడు తూడణన్ఱన్ ఉయిరై వాఙ్గి,**
**చ్చిలై వణక్కి మాన్ మరియ ఎయ్‌తాన్ఱన్నై**
**త్తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**తలై వణక్కి క్కైకూప్పి ఏత్తవల్లార్**
**తిరితలాల్ తవ ముడైత్తు త్తరణితానే** 5

(శత్రువుల) బలాన్ని ఓడించే రీతిలోని, పర్వతాలవంటి గొప్ప బాహువులను కల విరాధుడనే రాక్షసుని సంహరించి, సులభమైన ద్రావిడ భాషను సంస్కరించిన గొప్పముని అయిన అగస్త్యుడు ఇచ్చిన గొప్ప వింటిని పొంది, జింక చూపులను ఓడించే రీతిలోని చూపులను కల శూర్పణఖయొక్క ముక్కును ఖండించి, ఖరదూషణుల ప్రాణాలను గ్రహించి, మాయామృగంగా వచ్చిన మారీచుడు చచ్చేటట్లు వింటిని వంచి బాణాన్ని ప్రయోగించిన శ్రీరాముని, తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్‌లో శిరస్సుతో అభివాదం చేసి, అంజలిని ఘటించి, నోటితో స్తుతించగల్గినవారు సంచరించినందువల్ల ఈ భూమి భాగ్యాన్ని కల్గినదిగా అవుతున్నది.

**తన మరువు వైతేకి పిరియలు*ఱ్ఱు***
**త్తళర్వెయ్‌తి చ్చడాయువై వైకున్దత్తే*ఱ్ఱి*,**
**వన మరువు కవియరశన్ కాతల్ కొణ్డు**
**వాలియై క్కొన్ఱు ఇలఙ్గైనకరరక్కర్ కోమాన్,**
**శిన మడఙ్గ మారుతియాల్ శుడువిత్తానై**
**త్తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఇనితమర్న్ద అమ్మానై ఇరామన్ఱన్నై**
**ఏత్తువార్ ఇణైయడియే యేత్తినేనే** 6

(తనకు) సంపదగా వెలిగే సీతాదేవిని విశ్లేషించి అందువల్ల మనస్సులో కలత చెంది, (ఆ సీతాదేవికోసం రావణునితో పోరాడిన) జటాయువును పరమ పదానికి పంపి, (వాలికి భయపడి) అరణ్యంలో దాగి నివసించే వానరప్రభువైన సుగ్రీవునితో స్నేహాన్ని చేసి, వాలిని సంహరించి, లంకాపట్టణానికి, రాక్షసులకు అధిపతి అయిన రావణుని కోపం అణిగేటట్లుగా హనుమానునిద్వారా జ్వలింపజేసినవాడు, తిల్లైనగరం



లోని తిరుచ్చిత్తిరకూడమ్‌లో భోగ్యంగా వేంచేసి ఉండేవాడు, సర్వస్వామి అయిన శ్రీరాముని స్తుతించేవారి శ్రీచరణాల జంటనే స్తుతించగలిగాను.

**కురై కడలై అడలమ్బాల్ మఱుక ఎయ్‌తు**
**కులై కట్టి మఱుకరైయై అతనాలేఱి,**
**ఎరినెడువేల్ అరక్కరోడుమ్ ఇలఙ్గై వేన్దన్**
**ఇన్నుయిర్ కొణ్డువన్దమ్బిక్కరశు మీన్దు,**
**తిరుమకళోడు ఇనితమర్న్ద శెల్వన్ఱన్నై**
**త్తిల్లై నకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**అరశమర్న్దాన్ అడి శూడుమ్ అరశైయల్లాల్**
**అరశాక ఎణ్ణేన్ మ*ఱ్ఱ*రశుతానే.** 7

ధ్వనించే (ఘోషించే) సముద్రాన్ని కఠినమైన బాణంతో కలత చెందేటట్లుగా ప్రయోగించి, అందులో వారధిని కట్టి, ఆ వారధిమార్గంద్వారా సముద్రంయొక్క ఆవలి తీరాన్ని చేరి, (శత్రువులను) దహించేటట్లుగా ఉన్న, దీర్ఘమైన వేలాయుధాన్ని కల రాక్షసులు, లంకాధిపతి అయిన రావణుడు – అనే వీరియొక్క భోగ్యమైన ప్రాణాలను గ్రహించి, ఆ రావణుని తమ్ముడైన విభీషణునకు రాజ్యాన్ని అనుగ్రహించి, శ్రీదేవియొక్క అవతారం అయిన సీతాదేవితో పాటు, భోగ్యంగా అమరి ఉండే, సమస్తైశ్వర్యాలను కలవాడై, తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్‌లో, రాజ్యాన్ని చేసేవానియొక్క శ్రీచరణాలను తలపై ధరించడం అనే రాజ్యాధికారాన్ని తప్ప, దానికంటే వేఱయిన రాజ్యాధికారాన్ని, ఒక విషయంగా నేను లెక్కించను.

**అమ్బొనెడు మణిమాడ అయోత్తి యెయ్‌తి**
**అరశెయ్‌తి అకత్తియన్‌వాయ్ త్తాన్ మున్ కొన్ఱాన్**
**తన్, పెరున్దొల్ కతై కేట్టు మితిలైచ్చెల్వి**
**ఉలకుయ్య త్తిరువయిఱు వాయ్‌త్త మక్కళ్,**
**శెమ్బవళత్తిరళ్వాయ్ తన్ శరితై కేట్టాన్**
**తిల్లై నకర్ త్తిరుచ్చిరకూడన్దన్నుళ్,**
**ఎమ్బెరుమాన్ఱన్ శరితై శెవియాల్ కణ్ణాల్**
**పరుకువోమ్ ఇన్నముతమ్ మతియో మన్దే** 8

(పట్టాభిషేకంకోసం అలంకరింపబడ్డ) అందమైనవి, ఉన్నతమైనవి, రత్నాలు పొదిగినవి అయిన మిద్దెలను, మేడలను కల్గిన అయోధ్యకు తిరిగి చేరి, రాజ్యభారాన్ని వహించి, తనచే పూర్వం వధింపబడ్డ రావణుని గొప్ప పూర్వవృత్తాంతాలను అన్నిటినీ

అగస్త్యమహర్షి చెప్పగా విని, శ్రీజనకరాజుకుమార్తె అయిన సీతాదేవి లోకం అంతా ఉజ్జీవించేటట్లుగా పొందిన పుత్రులు కుశలవుల ఎఱ్ఱని పగడంవంటి నోటితో తన చరిత్ర అయిన శ్రీరామాయణాన్ని ఆలకించిన, తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిర కూడమ్‌లో వేంచేసి ఉండే నా స్వామియొక్క, చరిత్రను చెవులతో విని, కన్నులతో దర్శించి అనుభవించగల మేము, భోగ్యమైన దేవతల అమృతాన్ని ఇక ఒక పదార్థంగా గౌరవించము.

**శెఱితవ చ్చుమ్బుకన్దన్నై చ్చెన్ఱుకొన్ఱు**
**శె*ఴు* మఱైయోన్ ఉయిర్ మీట్టు త్తవత్తోనీన్ద,**
**నిఱై మఱిప్పూణ్ అణియుఙ్గొణ్డు ఇలవణన్ఱన్నై**
**త్తమ్బియాల్ వానే*ఱ్ఱి* మునివన్ వేణ్డ,**
**త్తిఱల్ విళఙ్గుమ్ ఇలక్కుమనై ప్పిరిన్దాన్ఱన్నై**
**త్తిల్లై నకర్ త్తిరుచ్చిరకూడన్దన్నుళ్,**
**ఉఱైవానై మఱవాత ఉళ్ళన్దన్నై**
**యుడైయోమ్ మ*ఱ్ఱు*ఱు తుయరమ్ అడైయోమన్ఱే 9**

మిక్కిలి గొప్ప తపస్సును కలవాడైన శంబూకుడనే శూద్రుని (అతడు ఉండే చోటను వెదకి) చేరి అతని శిరస్సును ఖండించి, ఉత్తముడైన బ్రాహ్మణుని కుమారుల ప్రాణాలను తిరిగి తీసికొని వచ్చి, అగస్త్యభగవానుడిచ్చిన, గొప్ప వెలను కల్గిన రత్నాలచే పొదగబడ్డ హారాన్ని అలంకరించుకొని, లవణాసురుని, తమ్ముడైన శత్రుఘ్నునిద్వారా వీరస్వర్గానికి పంపించి, దుర్వాసముని శాపంవల్ల పరాక్రమంతో ప్రకాశించే లక్ష్మణుని విశ్లేషించినవాడు, తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్ అనే దివ్యదేశంలో నిత్యవాసాన్ని చేసేవాడైన శ్రీరాముని ఏనాడూ మఱవని మనస్సును కల మేము "భగవానుని అనుభవించలేక పోయాము" – అనే క్లేశాన్ని పొందము.

**అన్ఱు శరాశరఙ్గళై వైకున్దత్తే*ఱ్ఱి***
**అడలరవ ప్పకై యేఱి అశురర్‌తమ్మై**
**వెన్ఱు, ఇలఙ్గు మణినెడున్దోళ్ నాన్గుమ్ తోన్ఱ**
**విణ్ ము*ఴు*తు మెతిర్ వర త్తన్దామ మేవి,**
**చ్చెన్ఱు ఇతు వీ*ఱ్ఱి*రున్ద అమ్మాన్ఱన్నై**
**త్తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్,**
**ఎన్ఱుమ్ నిన్ఱాన్ అవనివన్ ఎన్ఱేత్తి**
**నాళుమ్ ఇఱైఙ్జుమినో ఎప్పొ*ఴు*తుమ్ తొణ్డీర్! నీరే 10**



(తన దివ్యస్థానానికి వేంచేసిన) ఆ నాడు (అయోధ్యలో ఉండే) అన్ని చరాచరాలను పరమపదానికి చేర్చి, బలిమిని పొందికగా కల ఆదిశేషునకు విరోధి అయిన గరుడునిపై ఎక్కి రాక్షసజాతిని జయించి, ఆ వీరలక్ష్మి ప్రకాశించేటట్లుగా, పరమపదంలో ఉండే అందఱు ఎదురు వచ్చి స్వాగతం పలుకగా, తన నివాసస్థానం అయిన వైకుంఠానికి వేంచేసి, తన పరత్వం అంతా ప్రకాశించేటట్లుగా వేంచేసి ఉన్న సర్వేశ్వరుని, తిల్లై నగరంలోని తిరుచిత్తిరకూడమ్‌లో నిత్యవాసాన్ని చేసేవానిని, అటువంటివాడు, ఇటువంటివాడు– అని స్తుతించి, అనన్యప్రయోజనులైన మీరు ప్రతిదినం నిరంతరం ఎడతెగక స్తుతించి ఉజ్జీవించండి.

**తిల్లైనకర్ తిరుచ్చిత్తిరకూడన్దన్నుళ్**
**తిఱల్ విళఙ్గు మారుతియోడు అమర్న్దాన్ఱన్నై,**
**ఎల్లైయిల్ శీర్ తయరతన్ఱన్‌మకనాయ్**
**తోన్ఱి*ఱ్ఱ*తు ముతలా త్తన్నులకమ్బుక్క తీఱా,**
**క్కొల్లియలుమ్ పడైత్తానై క్కొ*ఱ్ఱ* వొళ్వాళ్**
**కో*ఴి*యర్‌కోన్ కుడై క్కులశేకరన్ శొఱ్చెయ్‌త,**
**నల్లియలిన్దమి*ఴ్‌*మాలై పత్తుమ్ వల్లార్**
**నలన్దికఴ్ నారణన్ అడిక్కీ*ఴ్* నణ్ణువారే**

తిల్లైనగరంలోని తిరుచ్చిత్తిరకూడమ్ అనే దివ్యదేశంలో పరాక్రమంతో ప్రకాశించే హనుమానునితో నిత్యవాసం చేసే శ్రీరామునిగూర్చి అంతు లేని కల్యాణగుణాలను కల దశరథచక్రవర్తికి కుమారునిగా పుట్టినది మొదలుగా, తన దివ్యస్థానానికి చేరేవరకు (ఉండే శ్రీరామాయణగాథను) (శత్రువులను) వధించడంలో అభినివేశాన్ని కల ఆయుధాలను కల సైన్యాన్ని, విజయాన్ని, సౌందర్యాన్ని కల ఖడ్గాన్ని కలవారు, ఉఱైయూర్‌కు అధిపతి, అధికారచిహ్నం అయిన తెల్లని గొడుగును కలవారు అయిన కులశేఖరా*ఴ్వా*ర్లు అనుగ్రహించిన, గొప్ప **"ఇయల్"** (పాటలు) అనే ద్రావిడలక్షణాలను పొందికగా కల్గిన, మధురమైన ద్రావిడ పాశురమాలికలో ఉండే పది పాశురాలను అభ్యసించగల్గినవారు పరమపదంలో ప్రకాశించే సర్వేశ్వరుని శ్రీచరణాలను పొంద గలరు.

**పెరుమాళ్ తిరుమొ*ఴి*సంపూర్ణం**

Printed at TTD Press, Tirupati. C.2000-Free Booklet-2011-(VKS)